ఆర్య చరిత్ర రత్నావళి

# హనుమంతుని చరిత్రము

**౧,౨, భాగములు**

వావిలికొలను సుబ్బరాయ విరచితము



శ్రీరామసేవాకుటీరము,ఒంటిమట్ట కడప.

శ్రీరామజయము

ఆర్య చరిత్ర రత్నావళి

# హనుమంతుని చరిత్రము

**౧,౨, భాగములు**

వావిలికొలను సుబ్బరాయ విరచితము



ఆంధ్రవాల్మీకి వాసుదాసస్వామి

శ్రీరామసేవాకుటీరము,ఒంటిమట్ట   కడప.

ఆపదా మపహర్తారం

దాతారం సర్వసంపదామ్



లోకాభిరామం శ్రీరామం

భూయో భూయో నమామ్యహమ్.

కం. నీపాదకమల సేవయు
నీపాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపార భూతదయమును
దాపనమందార నాకు దయసేయంగదే

శ్రీరామాయనమః

శ్రీమదాంజనేయ ప్రసాదసిద్ధిరస్తు

# ఆర్య చరిత్ర రత్నావళి

# హనుమంతుని చరిత్రము

## ప్రథమ భాగము

===========

శ్రీ మహావిష్ణువు రావణుని వధించుటకై తాను భూమియందు మానవావతార మెత్తెదనని వచించుటయు, బ్రహ్మదేవుఁడు దేవతలలో నాయన పరిచర్య నిమిత్తమై మీరును మీ మీ యంశములతో ఋక్ష వానరుల సృజింపఁ జేయుఁడని చెప్పుటయు జ్ఞప్తియందున్నది. కదా ?ఆ సమయంబున మహాబలపరాక్రమ సంపన్నుడైన కేసరియను నొక గొప్ప వానరుఁడుండెను.

పుంజికస్థలయను నొక యప్సరస శాప కారణమున అంజనయనుపేర భూమియందుఁ బుట్టి యతనికి భార్యయై యుండెను. ఆ మహాపతివ్రత యొకనాఁ డిచ్ఛావిహారంబుగ నొక పర్వతాగ్రంబున సంచరించుచుండెను. ఆ సమయంబున నెవరో యామె కన్నులకుఁ గానరాక యామెను దాఁకి నట్ల య్యెను. దాని కా పతివ్రత కోపించి నా పాతివ్రత్యమును జెఱుప నుంకించువాఁడెవఁడనిపలికిన వాయుభట్టారకుఁ డామెతో నిట్లనియె. దేవీ! కోపింపకుము. నేను దాఁకుటవలన నీ పాతివ్రత్యమునకు హానిలేదు. నా యనుగ్రహమున నీ యుదరంబున జవ సత్త్వంబుల నన్నుఁ బోలిన కుమారుఁ డుదయించు ననెను. ఆ వరము ప్రకారము అంజనాదేవి గర్భంబున నొక వానర కుమారరత్నముదయించెను.

ఒకనాఁ డంజనాదేవి తన బాలునిఁ దొట్టిలో నుంచి ఫలములు గొనివచ్చుటకై యడవికిఁ బోయెను. ఆ సమయమునఁ దూర్పున సూర్యబింబ ముదయించు చుండెను. దాని యెఱ్ఱని కాంతిని జూచి తొట్టెలోని బాలుఁడు పండని భ్రమించి దానిని బట్టుకొనుటకై చివ్వున నాకాశమున నెగిరి పోవుచుండెను. ఇట్లు తన్ను సమీపించి వచ్చు బాలునిఁ జూచి యతఁడు చేయఁబోవు గొప్ప కార్యము లూహించి సంతసించి యతనికిఁ దన కిరణముల వేఁడిమి తగులకుండునట్లు సూర్యుఁడు ప్రకాశించెను. వాయు దేవుఁడును కుమారునకు శ్రమము కలుగకుండునట్లు కమ్మగ చల్లగ వీచుచుఁ బోవుచుండెను. ఆనాఁడే యమావాస్య యగుటచే రాహువు సూర్యునిఁ బట్టుకొన వచ్చుచుండెను. హనుమంతుఁడు రాహువుపై కుటికెను. తన్నుఁ బట్టు కొనవచ్చు హనుమంతునిఁజూచి రాహువు జడిని యింద్రునియొద్దకుఁ బోయి యిదివఱకుఁ బర్వదినంబుల సూర్య చంద్రులఁ బట్టునధికారము మాకు మాత్రమే యుండఁగా నిప్పు డాపనికి మఱియొకని నేర్పఱుపఁ గారణ



హనుమంతుఁడు సూర్యుని మ్రింగబోవుట

మేమని యడిగెను. నేను మఱువ్వరికి నేర్పఁబలేదని చెప్పి యింద్రుఁ డైరావతా రూఢుఁడయి రాహవుతోడ హనుమంతు నొద్దకు వచ్చెను. హనుమంతుఁడును ఐరావతారూఢుండైన నింద్రునిఁ బట్టఁబోవ నతఁడు కుపితుఁడై వజ్రాయుధముచే నాజంనేయుఁ గొట్టెను. ఆ దెబ్బతగిలి హనుమంతుని చెంప గాయపడెను. ఆవేద నకుఁ దాళఁజాలక యాంజనేయుఁడు మూర్ఛిల్లి యొక కొండపైఁ బడెను.

తన కుమారుని యింద్రుడు పీడించెనని వాయుదేవుఁడు కోపించి బాలు నెత్తుకొని యొక గుహలోనికి బోయి లోకమందంతయు సంచరించుట మానెను. వాయు సంచారము మానినతోడనే ప్రజయంతయు సహింపరాని బాధ పడఁజొచ్చెను. ఊపిరాడక పోయెను. మలమూత్రములు వెడలక పోయెను. అవయవసం ధులు భేదిల్లెను. కాలుసేతులు కట్టెలవలె నయిచాఁచుటకు ముడుచుటకు సాధ్యపడకపోయెను.

మహోదరములు వచ్చినట్లు లందరకుఁ బొట్ట లుబ్బెను. వేదాధ్యయనము నిలిచి పోయెను. హోమ ములు జరుగవయ్యెను. నిత్యకర్మములెల్ల నీటఁగలసెను. ధర్మకార్యములు లోపించెను. అప్పుడు దేవతలందఱు బోయి బ్రహ్మదేవునితో నిట్లనిరి. దేవా! అన్ని విధములయిన దేహములకు నీవు వాయుదేవుని ప్రాణముగా నిచ్చితివి. ఇప్పుడా జగత్ప్రాణుఁడేకారణము చేతనో సంచారముమాని అంతఃపుర స్త్రీలవలె మమ్ము నిట్టట్టు కదలకుండఁజేసెను. లోకముపడు బాధలు మే మేమని విన్నవింతము. మారుతుఁడు మమ్ము నిష్కారణముగఁ జంపయత్నించెను. దేవా! నీవే దిక్కు నీవే శరణము పాహిపాహి యనిన వారలంజూచి బ్రహ్మయిట్లనియె.

సురులారా! సమీరుఁ డిట్లు చేయుటకుఁ గారణము లేక పోలేదు. దీనిని జక్కఁ బెట్టెదను. నా వెంట రండని యింద్రాగ్ని యమ వరుణ కుబేరేశానాది పరివృతుఁడై పుత్రునకై శోకించుచు వాయుదేవుఁడున్న గుహయెద్దకు వచ్చెను. ఇంద్రాది సహితుఁడై వచ్చిన పరమేష్టినిఁ గాంచి బిడ్డ నెత్తుకొని లేచి సమీరుఁడు పాదములవ్రాలి నమస్కరించెను. బ్రహ్మయు నతని లేవనెత్తి యిట్లనియె.

నీవు పుత్రశోకంబున లోకమున కాకుల పాటు గూర్చుటెఱుంగుదు. నీవు పుత్రునకై దుఃఖింపఁబని లేదు. ఇతఁడు లోకోపకారంబుగ ననేక మహాకార్యములు చేయఁ గలడు. కావున దేవతలారా! వాయుదేవునకుఁ బ్రీతిగ నీ బాలునకుఁ దగిన వరంబు లిండనిన నింద్రుఁ డిట్లనియె.

ఈ బాలునకు నా వజ్రాఘాతమున హనువు భగ్నమయ్యెను గావున నితఁడు హనుమంతుఁ డనుపేర లోకమునఁ బ్రసిద్ధినిగాంచుగాక. ఇఁక నెప్పటికి నీతఁడు నా వజ్రముచే మృత్యువుఁ గూరకుండెడుఁగాక యనిన భాస్కరుఁ డిట్లనియె. నా తేజమున శతాంక మీ కుమారున కిచ్చితిని. ఇతఁడు విద్య నభ్యసించు ప్రాయము గలవాఁడునాఁ డితనికి నేను విద్య నేర్పెదను. శాస్త్రదర్శనమున నితనితో సమానులు లేకుండఁ జేసెద ననిన వరుణుండు నీళ్లచేతను దన పాశములచేతను మృతిలేకుండనట్లు వరమిచ్చెను.

కాలదండాదులచే మృత్యువుపాలఁ బడకుండునట్లును, వ్యాధి బాధితుఁడు కాకుండు నట్లును, యుద్ధ భూమి విషాదపడకుండునట్లు దండధరుఁడును, గుబేరుఁడు తన గదచేత మృతిఁగానకుండునట్లును, త్రిలోచ నుఁడు తన యే యాయుధము చేతను గాలవశత నొందకుండునట్లును, వరంబు లిచ్చిరి. బ్రహ్మయుఁ జిరాయు విచ్చి బ్రహ్మదండముచేతను నవ్యధ్యుఁడనియు బ్రహ్మాస్త్రమునఁ గట్టుపడి తన్మంత్ర జపముచే విడివడుననియు వరమొసంగెను. విశ్వకర్మయుఁ దాసు నిర్మించు నే యస్త్రశస్త్రములచేతను వీనికిఁ గీడురాదని యు దీర్ఘాయువగు ననియు వరమిచ్చెను. వరములు విని సతసించి సురజ్యేష్ఠుండున్నుండు. శత్రుమర్దన దక్షుండు. మిత్రరక్షణ సమర్థుడు. దుర్జయుండు. కామచరుండు కామరూపియై యెందును నెదురేదియు లేక యసమానకీర్తి గడించునని వచించి సురలతోఁ దన లోకమునఁ బోయెను. జగత్ప్రాణుండను బిడ్డను గొని వచ్చి యంజనచేతికిచ్చి సమస్త వృత్తాంతముఁ దెలిపి యథేచ్ఛమరిగెను.

అంత నబ్బాలుఁడు కొంత కాలమునకు దిరుగులకు శక్తి రాఁగానే యా యరణ్యమందలి మునుల యాశ్రమములందు సంచరించుచు నా మునుల నారచీరలు చించుచు నగ్నిహోత్రము లార్పుచు వా రదలించిన గుఱ్ఱని వారిని బెదరించుచు స్రుక్కుల ఘటములను బగులగొట్టుచు ఫలములను రాల్చుచుఁ దీఁగలఁద్రెంచుచు నిట్లు అంపుచేయుచున్న నాఋషీశ్వరు లాబాలుఁడు బ్రహ్మచే వరములు గొన్నవార్త యెఱింగి కోపించి శపింపక నొల్లక ఓ హనుమంతా ! యెవ్వరైనను నిన్నుఁ బ్రేరించువఱకు నీ బలమిట్టిదన నీకుఁ దెలియక యుండునుగాక యని శపించిరి. అది మొదలు తన శక్తిని మఱచి తక్కిన క్రోతులవలె నదలించిన భయపడి పరువిడుచు విల్లుచూచిన గుండె జల్లుమనఁ బాఱుచు నెదిరింప నోడుచుఁ దిరుగుచుండెను.

అంత విద్యాభ్యాసమునకు యోగ్యమయిన కాలమురాఁగా నంజనాదేవి కొడుకును జేరఁదీసి తండ్రీ! నీ విట్లు విద్యలేక సోమరివై తిరుగుట సరిగాదు. నీకు దేవత లీ యీ వరముల నిచ్చియున్నారు. విద్యలేని శక్తులు గ్రుడ్డివాని చేతిరత్నములు సమానములు. విద్యవలన నన్నిశక్తులు ప్రకాశించును. లోకపూజ్యత గలుగును. పూజ్యులు సమ్మానింతురు. ఆత్మజ్ఞానము కలుగును. ఇహ పరముల సుఖము కలుగును. కావున నీవు సూర్యునొద్దకు నేగి విద్యల నభ్యసింపుమని బోధించిన నాంజనేయుఁడు తల్లి యనుజ్ఞ పడసి యామెకుఁ బ్రదక్షణనమస్కారము లాచరించి ఱివ్వున నెగసి సూర్యునొద్దకుఁ బోయి నమస్కరించి నాకు బాల్యంబున మీరు విద్య నేర్పెద నని వరమిచ్చితి రని నా తల్లి చెప్పెను. ఆ నిమిత్తమున మీ యొద్దకు వచ్చితిని. వీనిని శిష్యు నిగ్రగ్రహించి కరుణించి విద్యాదానమొనర్పవేఁడెద నని ప్రార్థించిన నతని వినయ వివేకములకు సంతసించి సూర్యుఁడిట్లనియె. ఆంజనేయా ! నీ నొకచోట నొక నిమిషమైన నిలుచువాఁడను గాను. నాయొద్ద నీవెట్లువిద్య గ్రహించెదవు? నావెంట నీవును వచ్చి విద్య గ్రహింతువేని యవశ్యము నేర్పెదనినిన హనుమంతుఁడు తన దేహమును బెంచి తూర్పుకొండపై నొక పాదమును బడమటి కొండపై నొక పాదమును మోపి చెవిని సూర్యుని సమీపమున నుంచి యాయన చెప్పిన విద్యలన్నియు గ్రహించెను. ఈ విధముగ సూత్రము వృత్తి యర్థము పదముతోడ వ్యాకరణము ఛందస్సులోనగు శాస్త్రము అన్నియు నేర్చెను. తొమ్మిది వ్యాకరణములు ముఖస్థము లొనర్చెను. అన్ని విద్యలయందును బారంగతుఁడై మరలఁ దల్లియొద్దకువచ్చి యామెకు సమస్తముఁ దెలిపి తల్లీ! విద్యలన్నియు నేర్చితిని. శక్తి సామర్థ్యములు గడించితిని. ఇఁక నేను జేయవలసిన కార్యమెయ్యెది ? యనిన నామె యేమియుఁ జెప్పఁజాలక వాయుదేవుని బ్రార్థించెను వాయుదేవుండు ప్రత్యక్షమై కార్యం బేమియనిన నామె కుమారుప్రశ్నవిధం బెఱిఁగించిన వినతుండై నిలువఁబడియున్న యాంజనేయుం జూచి యాయనయిట్లనియె. కుమారా! యిప్పుడు వానరులకెల్ల వాలిరాజై కిష్కింధానగరమున నున్నవాఁడు. అతని తమ్ముఁడు సుగ్రీవుఁడు యువరాజు. నీవా సుగ్రీవు నొద్దకుఁ బోయిన నిన్నతఁ డాదరించి మంత్రిపదంబొసంగును. నీ వచటికిఁ బొమ్ము.

కుమారా! నీవు చదివిన చదువు హనుమంతుఁడను పేరురెండును సార్థకములైనవి. నీయట్టి కుమారుఁ డు గలుగుట నీ తల్లిదండ్రుల కీర్తియు లోకమున శాశ్వతమయ్యెను. నేను జెప్పినట్లు నీవు సుగ్రీవు నొద్ద మంత్రివై యుండుము. నీ వెవ్వరిని దర్శించిన నవ్యాజమై పరిపూర్ణమై భక్తి యుదయించిన కడుపులోని ప్రేవులు కరఁగినట్టై పోవునో యాయనకు నీవు దాస్యము చేయుము. ఆయనయే నీకు సేవిప యోగ్యుఁడు. ఆయ న వలననే నీకుఁ బరమశ్రేయస్సు కలుగునని చెప్పి యంతర్హితుఁడయ్యెను.

హనుమంతుఁడు తల్లికిఁ బ్రదక్షిణ నమస్కారము లాచరించి తల్లీ ! సుగ్రీవునొద్దకుఁ బోవ నా కును జ్ఞయిమ్మని వేఁడెను. అప్పుడంజనాదేవి యిట్లనియె. పుత్రా ! లోకమున సుతులు మతిమంతులు గుణవంతులు కీర్తివంతులు నగుట చూచుటకన్నఁదల్లికి మఱొం డభిలాషగలదా? ఉద్యోగవంతుఁ డగుపురుషునే లక్ష్మి వరించును గావున నీవు సుగ్రీవునొద్ద మంత్రి పదవినందఁబోవుట నాకెంతయు సంతోషకరమే. నా మనస్సు నఁ గల మఱియొండు కోర్కియు నీతోఁజెప్పెదను. స్త్రీలకుఁ బుత్రులందు ప్రీతికంటె మనుమలయం దెక్కువ మక్కువయుండుట స్వభావము. ఆకారణముచేతను దమ సంతాన మభ్యుదయము నొందఁ గోరియుడ దమ పుత్రున కెప్పుడు పుత్రుఁడుగలుగునా యని స్త్రీలు కాచియుందురు. నేను స్త్రీనేగదా. అంతియ గాక. “లేబర ముగాదె యిల్లాలు లేని బ్రతుకు” “అంగునలేని యిల్లు పొల్లు”లోనగు సూక్తుల వలనను, అపుత్రస్యగతిర్నాస్తి యని పుత్రులు లేనివానికిఁ బుట్టగతులు లేవను ప్రమాణవచనంబుల వలనను నీవు గృహస్థధర్మ మవలం బించి సుఖించుటే నాకుఁ బరమసమ్మతము. కావున నీవుబ్రహ్మచర్యము వదలు నాలోచనచేయమనిన నాంజ నేయుండు తల్లింజూచి కరములు ముకుళించి యిట్లనియె.

అమ్మా! లోకమునఁ బ్రవృత్తి మార్గమనియు నివృత్తిమార్గమనియు రెండు మార్గములు కర్మకాండము నాధారముగఁ గొని ప్రవృత్తిమార్గమును ననుసరించి సంసారమున వర్తించుచు దాన ధర్మములు యజ్ఞాదు లొనర్చువారు పుణ్యమార్జించి స్వర్గమునకుఁ బోయి యందా పుణ్యఫలము నానా సుఖములమూలమున ననుభవించి పుణ్యక్షయము కాఁగామరల భూమిమీఁద జనించి మరలఁగర్మములొనర్చి మఱిచచ్చి మఱిపుట్టి ఇట్లు కాలచక్రమునఁ దగిలి క్రిందికి మీదికి రాకపోకలు గావించుచుందురు. ఇట్టిది తుదకు దుఃఖమనఁదగునే కాని సుఖమనరాదు. దుఃఖముతో మిశ్రముగాని శాశ్వతసుఖమే సుఖము. అది సంసారచక్రమునఁ దగులు కొనని వారికి లభించును. అట్టి వాఁడే ముక్తుఁడు. ఆ మార్గమందుఁ బోవువాఁ డే నివృత్తి మార్గమునందుఁ

బోవువాఁడు. ఆ మార్గమునఁ బోయినవాఁడు మరల రాఁడు.కావున నేమార్గముసౌఖ్యదాయకమో నీవే యాలోచింపుము.సంసారము కాంతామూలము కాంతయే సమస్త దుఃఖములకు మొదటి కారణము.అంగనా సంగతి వదలఁ గలిగినవాఁడే ముల్లోకముల జయింపఁగలిగిన వాఁడు.తరుణులవలనఁ బురుషులకు సుఖము గలుగుటయుఁ గలలోని క్షీరపానమున దేహబలము గలుగుటయు సమానములు.తల్లీ ! స్త్రీ జాతిని దూషించితి నని తలఁపకుము.కామము స్త్రీజాతికి స్వభావగుణము.స్వభావము దూష్యమని నేను జెప్పను.దీపశిఖకు దాహకగుణము నైజము.అది యెఱుఁగక భ్రాంతిపడి దానియందు మతిలేని శలభము దుముకును.సత్యమెఱింఁగినవి దూరమునంద తొలఁగును కావున దోషము శలభముదిగాని యగ్నిదిగాదు.జ్ఞాన ముచే సత్య మెఱిఁగినవారు భ్రాంతిపాలుగాక కాంతలకు లోపడరు.అజ్ఞానులు సంసారమునఁ జిక్కుకొని దిక్కు తెలియక మిణకరింతురు.ధృఢజ్ఞానము కలుగువఱకు గృహస్థమార్గమును విడువరాదు.ధృఢజ్ఞానము కలవాని కదియేల?కావున సన్న్యామార్గమునఁ బోవబలవంత పెట్టకుము.పుత్రులు లేకుండినఁ బుట్టగతులు లేవనుట ప్రవృత్తి మార్గమం దుండువారివిషయమే కాని జ్ఞానుల విషయము గాదు.కాళ్లురాని పిల్లలను దల్లులు మోసికొని పోవునట్లు స్వయముగ ఆత్మజ్ఞానముచే సూర్ధ్వలోకములు సంపాదింపలేనివారికిఁ బుత్రుల తోడుపాటు కావలసియుండును.కాళ్లు వచ్చి తనంత నెగురఁగల వానికి సాహాయ్యమేల? తన్నుఁదాను గాపాడుకొనలేక పరులను విశ్వసించియుండుటేమి నీతి ?బ్రహ్మచర్యమున మృత్యువునే జయింపవచ్చుననఁ దక్కిన మాటలే ? కావున నన్నీవిషయంబున నిర్బంధింపకు మని తల్లికి బునఃపునఃప్రణామంబు లాచరించి యామె యనుజ్ఞగొని సుగ్రీవునొద్ద కేగి యతని మంత్రియై హనుమంతుఁడు కాలము గడుపుచుండెను.

ఇట్లు కొంతకాల మరుగ వాలి సుగ్రీవులకు విరోధము పొసఁగెను.బలవంతుఁడైన వాలి సుగ్రీవునిఁ దన్ని యూరు వెడలగొట్టుటయే గాక యతని హింసింపఁదలఁచి తఱిమెను.అతనికి భయపడి సుగ్రీవుఁడు దేశదేశము దిక్కుదిక్కు దిక్కుగానక పరువెత్తుచుండెను.హనుమంతుఁడు తాను వాలినిఁ జంపశక్తిగలవాఁడయ్యు తనబలము తనకు తెలియని కారణము చేతను ఆయన ప్రేరింపఁబడక తనశక్తి తానెఱుఁగఁజాలడని సుగ్రీవునకుఁ దెలియని కారణముచేఁ బ్రేరింపకుండుటను సుగ్రీవుని వెంటఁదానును దేబవలెఁ బరువెత్తుచుండెను గాని వాలిని ధిక్కరించిన వాఁడు గాఁడు.ఇట్లు పరుగెత్తి పరుగెత్తి విసిగి తుదకు నీబాధతప్పించుకొను నుపాయమెఱుఁగక యల్లాడుచున్న సుగ్రీవునిఁ జూచి హనుమంతుఁ డిట్లనియె.సుగ్రీవా ! యెంతకాలమని యిట్లు బ్రాణభీతి నీవు పరుగెత్తఁగలవు ? దిక్కులు దేశములన్ని తిరిగి తిరిగి ప్రాణములు పిడికిటిలోనికి వచ్చెను.నామాట నాలింపుము ఋష్యమూకపర్వత మెక్కరానట్టు వాలిని మతంగమహాముని శపించెనుగదా ?అందు నీవుండిన వాలి నీపొంతకు రాఁజాలఁడు.అనిన హనుమంతా ! మంచి యుపాయము చెప్పితివి.నీపుణ్యమున బ్రతికితినని చావుపరువున వచ్చి ఋష్యమూకమెక్కెను.వాలియు శాపభయమున నాపర్వతముపై నెక్కక కిష్కింధకుఁబోయెను.అది మొదలు సుగ్రీవునిప్రాణము సుఖపడ నలువురు మంత్రులతో నతడు ఋష్యమూక మునందే కాలము గడుపుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు ఆకాశమార్గమున రామా రామా లక్ష్మణా లక్ష్మణా యను ధ్వని వినఁబడెను.ఇది యేమని యందఱు తలలెత్తి రావణుడు పట్టుకొని పోవుచున్న సీతాదేవిని జూచిరి.రావణుఁడు దుష్టుఁడు.బలవంతుఁడు.పరస్త్రీల నెత్తికొనిపోవుట వానికి నిత్యకృత్యము.కావున నెవతె నెత్తికొని పోవుచున్నాఁడో మనమేల వీనితోఁ గలహింసవలయునని సుగ్రీవాదు లూరకయుండిరి.సీతాదేవియును దాను ధరించిన సొమ్ములలోఁ గొన్ని యొలిచి పైఁటకొంగు చించియందు వానినిగట్టి వారు చూచుచుండ వారి ముంగలఁ బడవైచెను.ఆ ముడుపు పచ్చికనేల నొకచోటఁ బడెను.ఆంజనేయుఁడు తటాలనఁబోయి దానినిఁ దెచ్చి యొక గుహాలోఁ బదిలపఱచెను.

తరువాత గొన్నిమాసములకుఁ బంపాతీరమున నిరువురు విండ్లు బాణములు ఖడ్గములు ధరించి మునివేషములతో సంచరించు చుండిరి.వారిని సుగ్రీవుఁడు క్రోఁతులకుఁ జూపి యల్లదే పంపాతీరమునఁ గంటిరే.ఎవ్వరోకాని చాపబాణ ఖడ్గదారులై భద్రాకారులై బలసారులై వీరులిరువురు సంచరించుచున్నారు.వీరెవ్వరో వాలి పంపున మనల వధింప వచ్చినవారు.నిక్కపు మునులు గారు.వంచనచేయ నారచీరలు ధరించిన వారు కాకుండిన తాపసులకు శరచాపములేల ?కావున వారియెదుట నిలువరాదు.నిలచిన ముప్పు తప్పదని గుండెలు తటతట కొట్టుకొన నిప్పుత్రొక్కిన క్రోఁతివలె నిలచినచోట నిలువక యీబండమీఁదినుండి యాబండమీఁదికి నీగుండునుండి యాగుండునకు నీచెట్టునుండి యాచెట్టునకు నీకొండనుండి యాకొండకుఁ

బరువెత్తసాగెను. మంత్రులును సుగ్రీవు వెంటనంటి యొకరిని మించి యొకరు దాఁటులు పెట్టుచుఁబరువిడి యొక కొండమఱుఁగునఁ జేరిరి. అప్పుడాంజనేయుఁడు సుగ్రీవునొద్దకువచ్చి వానరేశ్వరా ! యేల యిట్లు పరువుపాఱెదవు? నీవు భీతిల్లఁ గారణమేమిగలిగెను? ఇది ఋష్యమూకము గదా? ఆ క్రూరుఁడైన వాలి యెక్కడఁ గానరాఁడు. తేరకు భయపడి నీ కపిత్వము సార్థకపఱచుకొనెద వేల? దేశముల బాలించు ఱేనికి లఘుచిత్త త్వము తగునా యనిన సుగ్రీవుఁ డిట్లనియె.

హనుమంతా ! నేను నిష్కారణముగ భయపడినవాఁడను గాను. అదో పంపాతీరముననున్న మాయము నులఁ జూడుము. వారి యాజానుబాహువులు విశాలవక్షములు భయంకరశర చాపఖడ్గములు చూచిన నెవఁడు భయపడఁడు.

రాజులు బహుమిత్రులు. వారి నేనాఁడును నమ్మరాదు. శత్రువుల వధింపఁ దమ మిత్రుల నెవ్వారినైన మాయారూపములఁ బంపుచుందురు. గూఢచారులవలన విరోధుల రహస్య మెఱుంగుచుందురు. పగవా రాదమఱచి యున్న సమయంబున గీడు గావింతురు. వాలియు సామాన్యుఁడు గాఁడు. నిరపాయక శీలియు సదుపాయక శాలియుఁ కావున నెవ్వరినేని తన మిత్రులను నన్ను వధింప నిట్లు పంపియుండ వచ్చును. రాజుల చరిత్రములు చిత్రములుగదా యనిన నాంజనేయుఁ డిట్లనియె.

కపీశ్వరా ! నీవు చెప్పిన వాక్యములు సత్యములే కాని నీవు భయపడుకుటకుఁ గారణము సరియైనది కాదు. వారు మాయామునులనియు నిటకు ద్రోహబుద్ధిచే వచ్చినారనియుఁ జెప్పితిని. దీనివలన నీ కింగితజ్ఞా నము లేదని తోఁడుచున్నది. వేషము లెన్ని వేసినను మనస్సు విధానము ముఖమునకుఁ గానవచ్చుచుండును. అది దాఁప నెవ్వరికి శక్యముగాదు. వారి ముఖము తీరు నారయ వారు కల్లకపటము లెఱుఁగనివారిని తోఁచుచున్నది. ఇంతకు వారిట కేల వచ్చిరో యెవ్వరివారో యెఱుఁగక సందేహించి భయపడనేల ! ఎవ్వరి నైన వారియొద్దకుఁ బంపి వారి తెఱుఁగు విచారించి యందు సందియ మేదైనఁ దోచిన నప్పటికిఁ దగినకార్య మాచరింత మనిన సుగ్రీవుఁ డిట్లనియె.

అటులైన నీవె యా కార్యమునకుఁ దగినవాఁడవు. నీవు నిజరూపమునఁ బోయిన నావాఁడవని వారు సందేహింతురు. ప్రాకృతవేషమునఁ బోయి మీ రెవ్వరు ? ఏల యిటకు వచ్చితిరి? మీదే దేశము ? ఎవ్వరివారు? మునివేషములు ధరించియు శస్త్రపాణులు కానేల? యని ప్రశ్నించును వారి ముఖనేత్రాదులఁ బరీక్షింపుము. వారు ప్రత్యుత్తర మిచ్చు నపుడును వారిని జక్కఁగ శోదింపుము. వారియం దేమియు వంచనలే దని తోఁచెనా యప్పుడు నావిషయమై ప్రస్తావించి వారిమనస్సు నా కభిముఖమగునట్లు చేయుము. వారిమాట యందెంత సత్యమో యెంకయసత్యమో పరిశీలింపుము.

పోయిరమ్మనిన నాంజనేయుండును భిక్షుకవేషము ధరించి **సన్యాసి వేషంబున హనుమంతుఁడు రామలక్ష్మణుల యొద్దకు వచ్చుట.** వారియొద్దకుఁ బోయి వారికి సవినయముగ నమస్కరించి సుగ్రీవు నభిప్రాయప్రకారము దన యాలోచనమునకుఁ దగినట్టు వారితో నిట్లనియె.



అయ్యలారా ! మీరెవ్వరు ? ఇవ్వనదేశమునకు వచ్చిన కారణమేమి? మీరు రాజఋషులతోను దేవతలతోను సమానులుగ నున్నవారు మీ వేషములా మునివేషములు. అటులయ్యు మీరు సువ్రతులై యున్నవారు?సరోవరతీరమందలి వృక్షముల నేల యట్లు చూచుచున్నారు? మిమ్ముఁ జూచి యీవనములోని మృగములు పక్షులు భయపడి పరుగు లిడుచున్నవి. మీదేహకాంతి యీకాసారనీరములకు మెఱుఁగు పెట్టుచున్నది. వానప్రస్థమున నుండు రాజర్షులందునా మీరు మంచిప్రాయమున నున్నవారు. ఇట్టి ఘోరకాంతారమున మీరొంటిగఁ దిరుగుట చూడ మహాధీరులని తోఁచుచున్నది.

అయ్యా వినోదమునకై యీలోకమునఁగ్రీడ సలుప వచ్చిన సూర్య చంద్రులవలె నున్నవారు. మీరెవరు? మీ బాహువులు సుందరములు. అజానువులు. పరిఘసమానములు. అలంకార యోగ్యములయ్యు నేల మీరు భూషణములు ధరింపకున్నవారు? మీతీరు చూచిన సశైల ససాగర సవనంబగు భూచక్రమంతయుఁ బరిపాలింప యోగ్యులరయ్యు నిట్టిదశ నొందఁ గారణమేమి? మీ కోదండము లట్టి కోదండంబులు ధాత్రినెందును గానరావు. మీతూణంబులు శత్రుప్రాణంబుల హరించు బాణంబులచేఁ బూర్ణంబు. మీకృపాణంబులు కుబుసము విడిచిన పాములవలె భయదంబులు. అయ్యలార ! నేనింత మాటలాడుచుండినను మీరొక్కమాటైన మాటడరేల ? సుగ్రీవుఁడను వానరేశ్వరుఁడు కలఁడు. అతఁడుత్తమ ధర్మశీలి. ప్రతాపశీలి. అతఁడు జ్యేష్ఠభ్రాతచే నవమానింపబడి దుఃఖితుఁడై దేశదేశములు తిరిగి తుదకీ ఋశ్యమూకము వాసముగా గొనియున్నాడు. నేనాతని మంత్రిని. వాయుతనూభవుఁడను. పేరు హనుమంతుఁ డందురు. కామరూపధరుఁడను. కామసంచారుఁడను. ఆయన మీ స్నేహముఁగోరి నన్ను మీయొద్దకుఁ బంపెను. నా ప్రభువు మేలుకోరి యీభిక్షుకరూపము ధరించి మీయొద్దకు వచ్చితినని యూరకుండెను.

అమ్మణ్ణి–తాను సుగ్రీవుని దూత యని వానరుఁడ నని హనుమంతుఁడు నిజము చెప్పుట తప్పు. రామలక్ష్మణులు వాలిపంపున వచ్చినవారు కారు గనుక సరిపోయె. అటు కాకుండిన నిది కార్యహానికరము గదా.

తండ్రి–మీరింతమాత్ర మాలోచించుట సంతోషకరమే కాని మీబుద్ధిని పిందెలోనే పండనీయరాదు. ఏదోయొకటి తటాలున తోఁచిన నంతమాత్రముతో మీరాలోచించినదే సరియని యెదుటివారు గొప్పవారైనను పొరపడిరని యాక్షేపించుట సరియగునా ? అందు మీరా హననుమంతుని నాక్షేపించువారు సీతారాములయు హనుమంతునియు వాక్యములను కార్యముల గుఱించి మీరెక్కువబుద్ధి నుపయోగించి యాలోచించిననే సత్యము గనుఁగొనఁజాలుదురు. గాని లేనియెడల వెక్కిరింపఁబోయి వెల్లకిలఁబడుదురు. నేను జెప్పునది విని తరువాత హనుమంతుఁడు పొరపడెనో నీకే యాలోచనలేకపోయెనో తెలిసికొనుము.

రామలక్ష్మణులు శత్రుపక్షమువారని సుగ్రీవుఁడు సందేహించెను. ఒకవేళ యూహ సత్యమైనచోఁదాను నిజరూపమునఁ బోయినఁ గార్యహానియగును. మాఱువేషముతోనే పోవలయును. ఏరూపముతోఁ బోయిన మేలు? రామలక్ష్మణులయందు రాజచిహ్నములు మునివేషములు కనఁబడుచున్నవి. రాజులకు మునులకు నిరువురకు సన్న్యాసులు పూజ్యులు. సన్న్యాసుల యెదుట నెట్టివారు నసత్యమాడ నొల్లరు. కావున సన్న్యాసి వేషముతోఁ  బోవుట మేలని హనుమంతుఁడు తీర్మానించుకొనెను.

అట్లు సన్న్యాసివేషముతో బోయి రామలక్ష్మణులను జూడఁగానే వాయుదేవుఁడు చెప్పినట్లు హనుమంతునికి వారి యందత్యంతభక్తి జనించి ప్రేవులే కరఁగిపోవునట్టులాయెను. అభక్త్యతిశయముచేఁ దన్నుఁదాను మఱచి సన్న్యాసియగుటచే వారిమ్రొక్కుదానుగొనుటకు మాఱు తానే వారికి మ్రొక్కెను. తరువాత వారితో సంభాషించుటకు,బ్రారంభించెను. ఆ సంభాషణకాలమున రామలక్ష్మణుల యింగిత మెట్లు హనుమంతుఁడు పరిక్షించుచుండెనో యట్లే హనుమంతుని యింగితమును రామలక్ష్మణులు పరీక్షించుచుండిరి. ఆప్రకారము మాటలాడుట యందు హనుమంతుఁడు మీ రెవ్వరు? రాజర్షి చిహ్నములు మునివేషములు ధరించి యున్నారనఁగానే మనము మోసగాండ్రమని యితఁడు గ్రహించెను. ఇతని తెలివి యింతమాత్రమా యని రామలక్ష్మణ లనుకొనిరి. వారి ముఖవికారమువలన వారియభిప్రాయ మప్పుడే హనుమంతుఁడు గ్రహించి పొరపడితిని గదా యనుకొని వెంటనే మీరిట్లు వేషధారులైనను యేదియో సువ్రతముపూని యిట్టులైతిరిగాని లోకమున మోసగింపఁ  గాదని యర్థ మిచ్చునట్లు సువ్రతులరు అనెను.

అప్పుడు రామలక్ష్మణులు మన యభిప్రాయ మితఁడు గ్రహించెఁ  గదా యని ప్రసన్నముఖులయిరి. ఇట్లు హనుమంతుఁడు తన మాటలవలన రామలక్ష్మణుల ముఖముల వర్ణవికారములు లక్షించును నెంతజాగ్రత్తతో మాటలాడినను వారు ప్రత్యుత్తర మీయరైరి. ఏల? యితఁడు నిజమైన సన్న్యాసికాఁడని వారు గ్రహించిరి.

నేను నిజమైన సన్న్యాసిని కాడని వీరు గ్రహించియే నా నమస్కారమునకు వీరు ప్రతి నమస్కారమును జేయక ప్రత్యుత్తరమైన నీయకున్నారు. ఇఁక నాస్వరూపము దాఁచి ఫలములేదు. ఋజువర్తనమే మంచిదని తలంచి ఇప్పుడు తాను వానరుఁడనని సుగ్రీవుని మంత్రినని చెప్పెను. నేనిప్పుడు వ్యాఖ్యానముచేయఁ బూనలేదు గనకఁ గొంచెముగ మార్గముసూచించితిని. ఈవిధముగ మీరు తక్కినచోటుల నాలోచింపవలయును మీయభిప్రాయ మెట్టిదైన నగుఁగాక హనుమంతుని విషయమైన శ్రీరాముని యభిప్రాయము వినుఁడు.

ఈప్రకారము హనుమంతుఁడు మాటలాడి నిలువఁగా శ్రీరాముఁడు తమ్మునిఁజూచి యిట్లనియె. లక్ష్మణా! యితఁడు సుగ్రీవుని మంత్రియఁట మన మెవ్వనిఁ దలచుచుంటిమో యా సుగ్రీవుఁడే మనచెలిమికోరి యిట్లతనిఁ బంపెను. ఈయనకుఁ దగినరీతిఁ బ్రత్యుత్తర మిమ్ము.

సీ. నెయ్యంబుఁ దియ్యంబు నేర్పు దీపింప నీ
వాక్యజ్ఞునకు బ్రతివచన మిమ్ము
ఋగ్వేదమును జక్క నెఱుఁగనివాఁడు య
జుర్వేదధారణా శూన్యబుద్ధి
సామవేదమునఁ బ్రాజ్ఞత్వంబు లేనివాఁ
డిరీతి భాషింప నేరఁ డెపుడు
వ్యాకృతియంతయు వల్లించే నిజముగ
నెన్నిమారులొ యీతఁ డింతసేపు

ఆ. మాటలాడ నొక్కమాటయేనియు నప
శబ్దితంబు గాదు చక్షువులనొ
ముఖముననొ లలాటమున బొమలందు నొ
దోష మొకఁడైనఁ దోఁపదెందు.

చ. కొతుకులు లేక,విస్తరము గూడక, శంకకు సందునీక,య
ద్రుతమవిళంతంబు నయితొస్సులు పోవ కురోగలైకను
స్థితమయి మధ్యవస్వరముచే నలరారెడి వీనివాక్కు సం
స్కృతమును సక్రమంబు శుభ మెంతయు హృద్యమునై రహించెడిన్.

తే. అనఘ ! యీతని త్రిస్థలవ్యంజనస్థ
మైన చిత్రవచోగతి యాగ్రహమునఁ
జంపగత్తిని బైకెత్తు శత్రునైన
నెలమిఁ బొందింపఁజాలక యేలపోవు ?

రాజగువాఁడిట్టిదూతను సంపాదింపఁడేని యతని కార్యము లెట్లు సఫలము లగును? ఇట్టి దూతను గల రాజకార్యములు దూత ముఖముననే చక్కఁబడుచుండును. అని చెప్పిన వాక్యజ్ఞుఁడైన లక్ష్మణుఁడు వాక్యజ్ఞుఁడైన హనుమతో నిట్లనియె.

పండితేంద్రా ?సుగ్రీవుని సద్గుణగణములను ప్రభావమును మేము వినియున్నారము. అతని వెదకుచు మే మిందు వచ్చితిమి. నీవు చెప్పిన కీశరాజకార్యము నీవు చెప్పినట్టు చేయగలవారము. అనిన నమ్మాటలకు హర్షించి యిటువంటివారితోడ సుగ్రీవునకు మైత్రికుదిరెనేని యతని కార్యము చక్కఁబడుటేమివింత?అందును వీ రాయనను వెదుకుచు వచ్చినారఁట. ఇఁక నతనికి రాజ్యలబ్ధి దుష్కరమననేల యని తనలోఁదాను సంతోషించుచు సుగ్రీవుని హితముఁగోరి మఱియు రామునితో నిట్లనియె.

అయ్యా ! యీ భయంకరారణ్యమునందుఁ బంపాతీరమున నీవు తమ్మునితోఁ ద్రిమ్మరనేల? యనిన రామునియాజ్ఞ నొంది లక్ష్మణుఁ డిట్లనియె. మే మయోధ్యాధీశుఁడగు దశరథరాజు కుమారులము. ఆ కుమారులయం దీన జ్యేష్ఠుఁడు. ఈయన పేరు రాముఁడు. జనకుని సత్యసంధునిఁజేయ నీయన భార్యతో వనులకై బయలుదేఱెను. నేనీయన తమ్ముఁడను ఈయన గుణములవలన నేనీయనకు దాసుఁడనైతిని. ఇట్లు మేము మువ్వరము దండకార్యణమున సంచరించుచుండ నీయన భార్యను రాక్షసుఁడెవఁడో యపహరించెను. ఆమెను వెదకుచు మేము రాఁగా శాపకారణమున దానవుఁడైన దనుఁడనువాఁడు సుగ్రీవునితో మీరు స్నేహము చేసితిరేని యతఁడు మీకు సీతాదేవివార్త దెప్పించి యిచ్చునని చెప్పి దివమున కేగెను. ఆకారణముగ సుగ్రీవు

వెదకుచు వచ్చుచున్నారము. కపివరా ! యిఁ క మాయిరువురకు సుగ్రీవుఁడే దిక్కు.

ఉ. మానితసర్వ సద్గుణ సమంచితులై ధరణీపరాగ్రణుల్
మానుగ వేనిచేత బహుమానము గౌరవ మందుచుండిరా
దానివరేణ్యుఁడౌ దశరథప్రభుపుత్రుఁడు లోకవిశ్రుతుం
డీనయశీలుఁడిప్పుడు కపీశ్వరునిన్ శరణంబుఁ జొచ్చెడిన్

హనుమంతా? యిట్టి మహానుభావుఁడు శోకముచేఁ జిక్కి సుగ్రీవుశరణుఁ చోరుచున్నవాఁడు. ఆయన యాయనను జేకొనుటర్హంబని కన్నుల నీరుగాఱ శోకించిన వాయు నందనుండతనిఁజూచి యిట్లనియె.

ఆర్యులారా ! యిట్టి జితేంద్రియత యిట్టి బుద్ధివైభవము నిట్టి శీలసంపన్నత గల మిమ్ముఁ దన యదృష్టముచే సుగ్రీవుడు చూచెను. ఆయన వృత్తాంతముఁ జెప్పెదద వినుఁడు. అన్నయైన వాలి పగపూని యూరు వెడలఁగొట్టి యాయన భార్యను అధర్మపద్ధతిని తానేలుచున్నాఁడు. ఈయన దుఃఖాక్రాంతుఁడై యిడుమలు పడుచున్నాఁడు. కావున మీ కవశ్యము సీతను వెదకు కార్యమునఁ దోడు పడఁగలఁడు. కావున మీరచ్చటికి వచ్చుటే మేలన లక్ష్మణుండు శ్రీరాముంజూచి యీ వానర నాథుఁడు నిర్మల మనస్కుఁడు. సత్యము చెప్పుచున్నాఁడు.

ఈ. మోము ప్రసన్నభావమును మోదమునం బలుకాడు భంగులున్
సామముమీఱ వ్యక్తముగఁ జల్పు ప్రసంగము భంగిఁజూడఁగా
నేమియు మోస మీకపికులేశ్వరునందుఁ గనంగరాదు రా
మా మన మిప్పుడందుఁ బదమా? హనుమంతుఁడు కోరునట్లుగన్.

అనిన రాముఁ డంగీకరించెను. హనుమంతుఁడు భిక్షకరూపమున వదిలి నిజరూపమును గ్రహించి వారి నిరువురును మూఁపులపై వహించి యటఘుజవుండు సుగ్రీవుఁ డున్నెడకుఁ బోయి వారిని దించి సూర్యనందను కడకుఁ బోయి సుగ్రీవా? వీరు దశరథ నందనులు. రామలక్ష్మణులు. మహాబలపరాక్రములు. సత్య సంధులు. జితేంద్రియులు. ఇందు శ్రీరాములు భార్య రావణుఁ డపహరింప నామెను వెదకుచు నీ చెలిమిఁ గోరి వీరు వచ్చిరి. నీకు పూజ్యులు కావున వారియొద్దకు నీవు పోయి గౌరవించి పూజించి చెలిమిచేసికొనుమని యతనిని దోడితెచ్చి రామలక్ష్మణుల ముందర నిలిపెను. వారును రామసుగ్రీవులు నగ్నిసాక్షికముగ స్నేహ మొనర్చిరి.

రాముఁడు తనభార్యను రావణుఁడెత్తుకొని పోవుట మొదలైన వృత్తాంతముఁదెలిపి తనకుఁ గలిగిన కష్టమునకై శోకించెను. అదియంతయు విని సుగ్రీవుఁ డిట్లనియె. రామచంద్రా ! మీ రడివికివచ్చిన కారణము మీకుఁ గలిగిన దుఃఖము నామంత్రిశ్రేష్ఠుఁడగు హనుమంతుఁడు సర్వముఁజెప్పెను. నీభార్యవియోగదుఃఖము ను నేను బాపఁగలవాఁడ. ఆవిషయమై నీకు విచార మక్కఱలేదు. ఆదుష్టరాక్షసుఁడు సీతాదేవి నెందు దాఁచి నను నేను రోయించి నీకు వార్తతెప్పించెదను. కొన్నిమాసములక్రింద మే మీపర్వతాగ్రముననుండరావణుఁ డొక తలోదరిని బలాత్కారమునఁ గొని పోవుచుండెను. ఆమెయు రామాయని లక్ష్మణాయని యేడ్చుచుండెను. ఆమె మమ్మిందుఁజూచి తనమేననున్న సొమ్ములను చెఱఁగుకొంగున ముడిచి జాఱవిడిచెను. ఆమూటను బదిలపఱిచితిని. అని హనుమంతుని మోముచూడ నాయన తటాలునఁబోయి యామూటను దెచ్చి సుగ్రీవు చేతికిచ్చెను. దానిని గ్రహించి రామచంద్రా ! యివి నీభార్య యాభరణములేమో చూడుమని యిచ్చిన శ్రీరాముఁ డుచూచి యగునని నానాప్రకారముల విలపించెను. సుగ్రీవుఁడు సూరార్చి తనకు వాలికి విరోధము వచ్చిన విధముఁ దెలిపి వాలిని నీవు వధించితేని నీభార్యను వెదకించెదనని చెప్పెను. అప్రకారమే శ్రీరాముఁడు వాలిని సంహరించి వానర రాజ్యమునకు సుగ్రీవుని బట్టాభిషేకము చేసి సుగ్రీవా ! యిప్పుడు వర్షకాలము ప్రారంభించినది. ఈనాలుగు నెలలు యుద్ధయాత్రకనుకూలములు గావు. కావున నీవు కిష్కింధకుఁబోయి వానకాలము పోఁగానే రమ్మని పంపెను. సుగ్రీవుఁడట్టులే కానిమ్మని కిష్కింధకుఁబోయి రుమను తారను మరగి రాముని సమాచారమే మఱచెను. వానకాలము గడచెను. కామ పరవశుఁడై సుగ్రీవుఁడు గడువు మీఱుటయు నెఱుంగక సేనల జతగూర్పఁ బ్రయత్నము చేయఁడయ్యె. అది గ్రహించి మనము బోధింప కుండినఁ గార్యము తప్పునని యాలోచించి హనుమంతుఁ డొకనాఁడు సుగ్రీవుఁజేరఁబోయి యిట్లనియె.

సుగ్రీవా! నీ మిత్రులబలమున నీకుఁగీర్తియు,రాజ్యము,సుఖము సమస్తము లభించెగాని నీవు చేయవలసిన కార్యమొకటే మిగిలియున్నది. వానకాలమా గడచిపోయెను. యుద్ధయాత్ర కనుకూలమగు కాలము

వచ్చెను. నీ విదివఱకు వానర వీరులఁబిలిపించినవాఁడవు కావు. రాజనీతిఁ దలంపుము.

కం. కాల మెఱుఁగచుఁ దత్త
త్కాలంబున మిత్రులందుఁ దగు పద్ధతి భూ
పాలుఁడు వర్తింప యశో
జాలము రాజ్యంబు కీర్తి శౌర్యము పెరుఁగున్.

కం. దండంబును మిత్ర సుహృ
త్కాండంబును గోశబలము క్ష్మాపతి ! యీ నా
ల్గుండిన లెస్సగ రాజ్య మ
ఖండసమృద్ధిం దనర్చుఁ గపిలోకవరా !

నీవును వృత్తసంపన్నుఁడవు. నీ మనస్సు దుర్నీతిని పోవునదిగాదు. అట్టులుండియు నీవేల పొరపడి చేయవలసిన కార్యము నుపేక్షించితివి.

కం. తనపనుల నెల్ల వదలియుఁ
దనమిత్రుని కార్యమునకుఁ దతి ముత్సాహం
బును గొని చరించునాతఁడు
కనఁడెప్పుఁ డనకర్థంబుఁ గపికులతిలకా.

కం. కాలాతిక్రమణంబుగఁ
జాలగ మిత్రార్థమునకు సమకట్టి నరుం
డేలీల నెంతగాసికిఁ
బాలైనను మిత్రకార్యపరుఁ డన రతనిన్.

కాబట్టి నీవు సకాలమున మిత్రకార్య మొనర్పఁబూనుము. సీతాదేవిని వెదక వానరుల నంపుము. ఎంత టి కార్యమైనను సాధింపఁగల కవులు నీవశులై యున్నారు. మింటను మంటను నీళ్ళను భూమిని నైనఁ జొచ్చి వార్తతేఁగలవారలుండ వారిని బిలిపించి నీవేల యాజ్ఞాపింపకున్నావు ?కాలము మీఱెను గదా. రాముఁడే ల హెచ్చరింపరాదు. అతని కార్యముపై నతనికే శ్రద్ధలేకున్న నాకుశ్రద్ధ లేకుండుట దోషమా యనకుము. రాముఁ డు మహామేధావి. స్వకార్యమునందుఁ దీవరపాటు గలవాఁడయ్యుఁ గాలము మీఱుట యెఱింగియును నీవు చేసిన ప్రమాణము నీవెంతమాత్రము నిలుపుకొనఁగలవో చూచెదఁగాక యని యూరకున్నాఁడని తలంపుము. ఆయన హెచ్చరించినను హెచ్చరింపకున్నను నీకుఁ గర్తవ్యముగునది నీవు చేయవలదా? నీప్రాణ ము రక్షించెను. నీ వంశము రక్షించెను. నీకుఁ గీర్తిరాజ్యము గలిగించెను. ఆయన సాహాయ్యముచేఁ గదా నీవు భార్యలతో సుఖించుచున్నావు. ఇన్ని విధముల నీకుఁ దన ప్రాణమునకుఁ దెగించి సాహాయ్య మొనర్చిన వానికి నీవు మఱుమేలు చేయకుండుట నీతియగునా? నీవు బల ధైర్య స్థైర్య పరాక్రమములు గలవాఁడవు. ఇట్టి నీవితరుల కూరకయే తోడపడుట న్యాయమైయుండ నుపకారముచేసిన వారికిఁ బ్రత్యుపకారము చేయుట యేమివింత? ఒకవేళ నీవు తోడుపడకున్నంతనే రాముని కార్యము నిలుచునని తలంపకుము. ఆయన తనకార్యము తాను సాధించుకొనలేక నిన్నాశ్రయించె ననియుఁ దలంపకుము. ఆయన కోపించిన నరయక్ష రాక్షస సిద్ధసాధ్యవిద్యాదర కిన్నర కింపురుషాదుల నెల్ల క్షణమాత్రమున భస్మీకరింపఁగలడు. ఆయన యస్త్ర బలము నీవెఱుంగవు. నీవు చేయుసాహాయ్య మెట్టిదో చూడఁగోరి తాళియున్నాఁడు గాని దేబయైయూరకున్నాఁ డని తలంపకుము. కాల మతిక్రమించెఁ గదాయిఁక నేమిచేసి యేమి ప్రయోజన మని యుత్సాహము మానకుము.

కం. కాలాతిక్రమ దోషము
గ్రాలదు పరు లెచ్చరింపకయ మునుచేయన్
గాలాతిక్రమదోషము
గ్రాలెడిఁ బరులెచ్చరింపఁ గార్యము చేయన్.

కావున నిప్పటికైనఁ గర్తవ్య మాలోచింపుమనిన సుగ్రీవుండుసేవానాయకుండగు నీలునిఁ బిలిపించి మనసేనయంతయుఁ బదునేను దినములలో సమకూర్పుము పదునేనవ నాఁటికి నెవఁడు రాఁడో వాఁడు వృథుఁడని చాటింపుము. నీవును యువరాజగు నంగదుఁడును వలసినకార్యము లన్నియు నొనర్పుఁడని

చెప్పి యంతఃపురముఁ బ్రవేశించెను. గడువుమీఱినను సుగ్రీవుఁడు రాకుండుటచే రాముపనుపున లక్ష్మణుఁడు సుగ్రీవుపైఁ గోపించి కిష్కింధకు వచ్చెను. సుగ్రీవుఁడును తప్పునొప్పుకొని క్షమింపవేఁడెను. తరువాఁత గొన్ని దినములకు సేనలన్నియు గుమిగూడ వానినెల్లఁదోడ్కొనిపోయి సుగ్రీవుఁడు శ్రీరామున కప్పగించి వీరందఱు నెట్టికార్యమైన నిర్వహింపఁగల వీరులు. నీయాజ్ఞ చొప్పున వర్తించువా రన శ్రీరాముఁడు నీవే వీరినెల్ల సతాన్వే షణమందు నియోగింపుమనెను.

అప్పుడు సుగ్రీవుఁడు వినతాదులఁ దూర్పునకును, హనుమదాదుల దక్షిణమునకును, సుషేణాదులఁ బశ్చిమదిశకును, శతవలి లోనగువారల నుత్తరమునకును సీతను వెదకసేనలతోడఁ బోనియమించి వారితో నిట్లనియె. ఇది రామకార్యము రామకార్యమే నాకార్యము. కావున మీఱందఱు సీతను వెదకి యొకనెలలో రావలయును. ఆ గడువు మీఱినవాఁడు రాజాజ్ఞ మీఱినవాఁడు గావునఁ జంపఁబడును. పొండని చెప్పి హనుమంతుని బిలిచి సగౌరవముగ నిట్లనియె.

ఆంజనేయా ! యీ కార్యము నిర్వహించు భారము నీదియని నమ్ముము. నీళ్లయందును, నగ్నియందు ను, ఆకాశమందును, స్వర్గ పాతాళము లందును నీ గమనము నివారింపరాదని నే నెఱుంగుదును. సురగంధ ర్వాసుర నాగాదిలోకముల నీకుఁ దెలియరాని దొకటియు లేదు. నీవు మనసారఁ బూనిన నీకసాధ్యమును లేదు. జవమునను దేజంబునను లాఘవమునను గమనంబునను బలపరాక్రమంబునందు నీతండ్రితో సమానుఁడవు.

ఉ. ఓకపిలోకనాథ ! భవదున్నత తేజముచేతఁ జూచినన్
నీకు సమంబు భూత మవనీస్థలి లేదు: బలంబు బుద్ధి య
స్తోకపరాక్రమంబు గుణదోష విచారణ శక్తి దేశకా
లైక సదానువృత్తియు నయజ్ఞ ! తిరంబుగ నుండు నీయెడన్.

కావున హనుమంతా ! రామునికార్యము దీర్చుభారము నీది. రాముని కార్యమనిన నా కార్యమని నీ వెఱుఁగుదువుకదా. ఈ కార్యము నీ వొనర్పకున్న నేను మిత్రకార్యము చేయనివాఁడనగుదును. అది నాకెంత సంతాపకరమో నీవే యాలోచింపుము. కావున సీతాదేవి యెందున్నను ఏ లోకమందున్నను వెదకి తెలిసికొని రావలసినవాడవు నీవే. ఏమి చేసెదవో నా గౌరవమెట్లు దక్కించెదవో యనిన నీ మాటలన్నియు వినుచుండిన శ్రీరాముఁడును తనలో నిట్టు లాలోచించెను.

సుగ్రీవుడు చాల మేధావి. ఇతఁడీ హనుమంతుడీ కార్యమును సాధించునని నిశ్చయించి కార్య భార మంతయు నితని యందుంచెను. హనుమంతుఁడును కార్యసాధనమున నిశ్చితార్థకరుఁడు పూర్వమెన్ని ఘనకార్యములో యొనర్చి ప్రభువిశ్వాసము సంపాదించినబంటు గావున నితనిచే నాకార్యముతప్పక సఫలమ గును. అని సంతోషించి తనవ్రేల నున్న తనపేరు చెక్కిన బంగారుటుంగరముఁ దీసి శ్రీరాముఁడు హనుమం తుం జూచి యిట్లనియె.

ఆంజనేయా ! నీ వీ యుంగరమును దీసికొనిపోయి సీతకుఁజూపుము. నీవు నాదూతవని నమ్మి యామె నిర్భయముగ నీతోమాటలాడును. సుగ్రీవునియాజ్ఞ నీవు దీర్పఁగలవని తోఁచుటచే నీ కిచ్చుచున్నాను. నీ బలపరాక్రమములు నీయత్నము బుద్ధిసంపద యన్నియుఁ జూడ నీవీ కార్యము చక్కఁబెట్టఁగలవు. నీవెంత పరాక్రమమైనఁజూపి జానకీదేవి నెటుగాంచనగునో యట్టులు కార్యము సేయుము. నేను నీ బలాశ్రితుఁడను జుమాయనిన హనుమంతుఁ డుప్పొంగి యా యుంగరముం గొని శిరమున ధరించి శ్రీరాముపాదములపై వ్రాలి నమస్కరించి నిలిచెను.

తరువాత వానరుల వారివారికి నిర్దేశింపబడిన దిక్కుల సీతను వెదకఁబోయిరి. హనుమంతుఁడు నంగద జాంబవదాదులఁ గూడి దక్షిణదిక్కు రోయఁ బోయెను. నెల గడువునకు సరిగాఁ దూరువు పడమర యుత్తరము పోయిన వానరులు సీత కనఁబడలేదని వచ్చి చెప్పిరి. దక్షిణమునఁ బోయిన నంగదాదులు మాత్రము రారైరి. వాలిపుత్రుఁడు లోనగువారు వింధ్యపర్వతములఁజెట్టుట గుట్టలు మిట్టలు దరులు గిరులు కానలు కోనలు లోనైనవి వెదకుచు నెందును సీతను గానక పోవంబోవ నొకనాఁడెంతతాఁకున వడఁబడి దప్పిగొని యెందును నీరుగానక సొమ్మసిల్లుచునుండి యొకచోటఁ దడిఱెక్కలతో గుహలోనుండి వచ్చు పక్షులఁగని యా గుహయందుఁ గొల నేదైన నుండునని దానిఁజేరి చూడ నది యంధకారబంధురమై యుండెను. దానిని వానరులకుఁ జూపి వనకోవిదుఁడైన హనుమంతుఁ డిట్లనియె.

మిత్రులారా! దక్షిణమునఁ గల వనదుర్గముల నన్నిటిని వెదకి వెదకి వేసరితిమి. ఎందును జనకనందిని గానరాదు. మనమా మిక్కిలి కాసిఁబడినారము. నాలుకలా యెండిపోవుచున్నవి. నీటిపట్టా గానరా కున్నది. ఇదో యాబిలముఖమున బచ్చని చెట్టులున్నవి. లోపలినుండి తడిఱెక్కల పులుఁగులు వెలుపలికి వచ్చుచున్నవి. కావున నీ గుహలోపల నీరుండ నోపును. పోవుదము రండని యొకరి కేలుమఱియొకరు పట్టుకొని లోపలికిఁ బోయి యందందు మృగపక్షిసమూహంబులఁ జూచుచు నొకయోజనము హుటాహుటి పోయిరి. అచ్చట వెలుఁగుచే మనోహరమైన ప్రదేశము కనఁబడెను. అచ్చటి వృక్షములు సువర్ణకాంతుల నీనుచుండెను. ఇది యేమియో చూతమని పోవఁబోవ నొక తపస్విని తపస్సుచేసికొనుచుండెను. ఆమెను జూచి వానరు లందఱుఁ దమవలన నమ్మహాత్మురాలికిఁ దపోభంగ మాయెనేమో, యామె శపించునేమో యని భయపడి దూరదూరమునఁ జెట్లచాటున నిలిచిరి. హనుమంతుఁడు మెల్లగ నామెను సమీపించి నమస్కరించా యిట్లనియె.

“తల్లీ? నీవెవతవు? ఇందుండఁ గారణమేమి? ఇది యెవరిమందిరము? ఎవరిగుహ? ఎవరు దీని నిర్మించిరి? నీవేల యిందున్న దానవని యడిగిన సర్వభూతదయము సాధునిష్ఠముగల యమ్ముదిముదిత యిట్లనియె. మయుఁడను నసురశిల్పి యీగుహ తన ప్రియురాలగు హేమకై సృజిచియిచ్చెను. ఆమయఁ డింద్రునిచేఁ జచ్చెను. ఆహేమ నాసఖి. నేను మేరుసావర్ణి పుత్రికను. పేరు స్వయంప్రభ. నేనీ మందిరము నుద్యానము రక్షించుచుండుదును. వానరుఁడా మీ రెవరు? మీరేల కాంతారములఁ దిరుగుచున్నారు? ఎట్లు మీ రీ గుహనుఁ గనుగొంటిరి ? మీ చరిత్రము చెప్పుము. మిమ్ములను జూడ నాకఁట దప్పిని చాల గాసిపడి నట్లున్నారు. మీకుఁ గావలసిన ఫలము లారగించి కమ్మని చల్లని కాసార నీరంబుల గ్రోలి శ్రమముదీరిన వెనుక మీచరిత్రము చెప్పుఁడనిన నాప్రకారమందఱొనర్చి సేదదేఱిరి. పదపడి హనుమంతుఁడు శ్రీరామ చరిత్రము సుగ్రీవచరిత్రముఁ జెప్పి తాము సీతను వెదకుచు వచ్చుటయు ఆఁకలిడప్పుల బాధపడుటయు నాకస్మికముగ నీ గుహనుచూచుటయు నందుఁ జొచ్చుటయు నెఱింగించి మఱియు నిట్లనియె. పుణ్యచరిత్రా! ప్రాణములు పోవు సమయంబున మాకు ఫలాహారము లొసంగి ప్రాణములు కాపాడితివి గావున నీకు మఱుమేలు చేయఁగోరుచున్నారమని యీ కపులెల్ల నీతో విన్నవింపు మనుచున్నారనిన నామెయునుఁ దపస్సు చేయుచు ధర్మమార్గమందుండు నాకు మీవలనఁ గావలసిన యుపకారమేదియు లేదు. మీకేదైన నుపకారము కావలసియుండినఁ గోరుఁ డనిన హనుమంతుఁ డిట్లనియె.

తల్లీ! మాకు సుగ్రీవుఁ డొసఁగిన నెల గడువు ఈఋక్షబిలమున సంచరించుటయందే మీఱెను. మేము చేయవలసినమహాకార్యమున్నది. కావున మాయందుఁ గరుణించి మేమెల్లనీగుహనుండి వెలుపలికిఁబోవుమార్గ ము తెలుపుమనిన స్వయంప్రభ యిట్లనియె.

ఈగుహలోనికి వచ్చినవారు మరలఁ బ్రాణముతో వెడలిపోవుట కల్ల. కావున నొకయుపాయము చెప్పెదను. మీరెల్లరు గట్టిగఁ గన్నులు మూసికొనుఁడు. నాతపోబలంబున వెలుపలఁజేర్చెద ననిన వారందఱు నట్ల యొనర్చిరి. ఆమె వారి నెల్లగుహదాఁటించి కన్నులు దెఱువుఁడని చెప్పి ఇట్లనియె. వానరులారా యిది వింధ్యాద్రి. ఇదియే ప్రస్రవణగిరి. అదిగో సముద్రము.

మీకెల్ల శుభమగఁగాక. నేఁబోయి వచ్చెద నని యామె తనమందిరమున కరిగెను. వానరులును వనవృక్షముల తెఱఁగుచూచి వసంతము రాఁబోవుచున్నదని గ్రహించి గడువు చాల మీఱుటకు భయపడి యేమిచేయుటకు నాలోచనపోక యూరకుండిరి. అప్పుడు వానరులనుజూచి యంగదు డిట్లనియె.

కపీచంద్రులారా ! మనకు వానర రాజిచ్చిన నెలగడవు మించిపోయెను. వచ్చిన కార్యము కాదాయెను. మన మూరకపోయిన నుగ్రదండుఁడగు సుగ్రీవుఁడు మనల వధింపకమానఁడు. కావున నటకేఁగి చచ్చుటకంటె మనమింద ఱిచ్చటనే మరణించుటమేలు. నీవు యువరాజువుగదా. నిన్నేల రాజు వధించుననకుఁడు. నాకు యౌవరాజ్య మిచ్చినవాఁడు శ్రీరాముఁడు గాని సుగ్రీవుడు కాఁడు. రాము కారణమున నాతండ్రిమీఁది విరోధము నామీఁదఁజూపలేకున్న వాడు. ఇప్పుడు కారణమబ్బుటచే నన్నుఁ దప్పక వధించును. నాతోపాటు మీరందఱు వధ్యులగుదురు. కావున నీ సముద్రతీరమందే యందఱము ప్రాయోపవేశ మొనర్తమనిన వానరు లిట్లనిరి.

యువరాజా ! నీవు చెప్పినది సత్యము. సుగ్రీవుడు స్వభావము చేతనే యుగ్రుఁడు. రాముడో భార్యను బోఁగోట్టుకొని తపించుచున్నవాఁడు. కావున నతని సంప్రీతికై మనల నెల్ల సుగ్రీవుఁడు వధించును. మరణమే

శరణము నొందుట మేలు.అనినఁ దారుఁ డిట్లనియె.చూచి చూచి యాత్మహత్య చేసికొన నేల?ఇప్పుడు మనము వెలువడిన గుహలోనికిఁ బోయి యావజ్జీవముందము.అది యింద్రునకైన నభేద్యము.అనిన వారల మాటలు విని యోహెూ కార్యము తప్పనట్లున్నది.అంగదుఁడు సామాన్యుఁడు గాఁడు.పదునాలుగు గుణములు నెనిమిది యంగముల గల మేధయు.నాలుగు విధముల బలము గలవాఁడు.వానరులనెల్ల దనవశము చేసి కొనినాఁడు.ఇతఁడు రాజ్యమును హరించుటకును సమర్థుడు.ఇటైన వానరరాజ్యము భిన్న మగుటకును సుగ్రీవు సర్వాధికారము చెడుటకు రాముకార్యము విఫల మగుటకుఁ గారణమగును కావున వీని నిట్లు విడువరాదని తలఁచి వానరులతో నిట్లనియె.

వానరులారా ! నామాట కొంచెము వినుఁడు.మీయలో చనలు బాగున్నవి గాని యవి నెరవేర్చుటయం దుఁ గొన్ని సందేహములు కలుగుచున్నవి.ఏకార్యమైనను ముందు వెనుక నాలోచింపక చేయరాదు గదా?మీరంద ఱిందుఁ బ్రాయోపవేశమొనర్తు రేని నేను మీలోని వాఁడనేకదా.అందు నాకు భార్యయు బిడ్డలు లేరు.నాతల్లియో నాతండ్రియెద్ద నున్నది.కావున నాకెట్టి జంజాటమును లేదు.అయినను జక్కఁగ నాలోచింపక కార్యము చేయుట నా స్వభావముగాదు.సీతాదేవి వార్త సుగ్రీవునకుఁ జెప్పకయే మరణించిన మనము రాజాజ్ఞను మీఱినవారమే గదా. ఈమీరుట వలన నెవ్వరెవ్వరకి నెంత నష్టమో యోజింతము.సుగ్రీ వుఁడు కృతజ్ఞుఁడై యీ కార్యమునకు మనలఁబంపెను.ఏ వార్తయుఁ దెలియకపోవుటచే నతని గతియేమి? రామునిగతియేమి?రామునకు మనకు నెట్టివిరోధము లేదుగదా? మనవలనఁ గాలేదని స్పష్టముగఁ జెప్పినఁ దరువాత ఆయన శక్తి సామర్థ్యముకొలఁది తనకార్యము తాను సాధించుకొనును గదా? అట్టిదానికి మనము విఘ్నము కలిగించిన వారమైతిమేని దుఃఖముచే నాయన యేగతిఁ బట్టునో.ఆయన తమ్ముఁ డేమగునో, ఆవార్త తెలిసిన వారి బంధువులు రాష్ట్రప్రజలేమగుదురో అదంతయుఁ గని సుగ్రీవుఁడేమగునో అతని మిత్రు లేమగుదురో.వానరరాజ్య మేగతి పట్టునో.ఇంతటి యనర్థమునకుఁ బాపమునకు మనమే కదా కారణభూతులము.మన శక్తిసామర్థ్యములకొలఁది వెదకి సీత కనఁబడలేదని చెప్పిన నిందఱ నేకకాలమున సుగ్రీవుఁడు దండించునా ? భూతదయా పరుఁడగు రాముఁ డట్టి ఘోరకార్యము సహించునా? మనముపోక పోయితిమేని రాముఁడు సుగ్రీవు విషయమై యేమి సందేహించునో అతఁడేదియో వంచన చేసినాఁడని రామునకుఁ దోఁచిన నచటి వానరులను సుగ్రీవు తోడ దహింపఁడా ? ఈకీడునకు మనమే కదా కారణభూతు లము.అదియుఁబోనిండు.మీరందఱిచ్చటఁ జచ్చిన మీ పెండ్లాల బిడ్డల గతియేమి? వారి నెవరు భరింతురు? రాజద్రోహుల కుటుంబములను రాజుభరించునా ?మీప్రాయంపుటిల్లాండ్రు పరులపాలై పోవలసి వచ్చును.ఈ విషయమై మీరేమి యాలోచించితిరి ? అనిన నొకవానరుఁడవు నవును హనుమంతుఁడు చెప్పినది సత్యమే.నా భార్య చిన్నది యొంటిగ నింటనున్నది.నేను రాత్రులందుఁ బోయివచ్చుచుందును లేక యిచ్చటికి రహస్యము గాఁ బిలిచికొని వచ్చెద ననెను.నీ పెండ్లామెక్కువయేమి నా పెండ్లాము తక్కువ యేమి యని మఱియొకఁడనెను. ఎవఁడైన నొకఁడు పోయి యందఱ పెండ్లాలను బిలుచుకొని రావచ్చునని వేఱొకఁ డనెను.ఆవార్తతెలిసినా సుగ్రీవుఁడు దండుతో వెంటనే వచ్చి సోమరులమని మనల దండించునని యొండొకఁడనెను.పెండ్లాలను బిడ్డలనందరనిటకుఁ దెచ్చిన నీపాడదువులలో వారిని గాపాడు విధమేమని యొండు వానరుఁ డనెను.సుగ్రీ వునొద్దకు మనము పోయిన మనలను జంపఁడు.మనము పిల్లవారము పెద్దవారిచేతి క్రిందివారము వారు చూడుమనినచోటఁ జూచితిమి.ఉండు మనినచోట నుంటిమి.మనకు స్వాతంత్ర్య మేమున్నది.పెద్దవారు గడువులోపల మరలపోయిన మనము వలదంటిమా ? ఈవార్త సుగ్రీవునితోఁ జెప్పిన మనలఁ గరుణించును. పెద్దవారిని దండించిన దండించును.వారి నిమిత్తమైన మనమేల యందరము చావవలయును అని యీవిధ ముగా వానరులు వారువారు నానావిధముల భిన్నాభిప్రాయము లిచ్చుచు వాదించుకొనుచండ హనుమంతుఁ డంగదుతో భయనయములుచూపుచు నిట్లనియె.

అంగదా ! నీవేమి యింతటి పిల్ల యాలోచనచేయఁ జూచెదవు ? నీయొకనికై యిందఱ ప్రాణములను నిట్టనిలువున దీయఁదలచెదవేల? నీముఖమునెదుట నిర్దాక్షిణ్యముగఁ జెప్పుచున్నాను.వినుము.ఒకవేళ వీరం దఱు నీపక్షము వహించి సుగ్రీవునితో విరోధించినను సుహెూత్రుఁడు జాంబవంతుఁడు నీలుఁడు సుగ్రీవుని విడుచువారు గారు.నేనును వారితోడి వాఁడనే.మేము నీ తర్జన భర్జనములకు భయపడము.నీదానమానాదులకు లోపడము.నీవేమి చేసియు మమ్ము వశపఱచుకొనలేవు.నీవు నీతండ్రికంటె యుద్ధక్రీడ నేర్పరివి.కపిరాజ్య భారమంతయు నేల సామర్థ్యము గలవాఁడవు.అట్టి వాఁడవు దూరాలోచన చేయక దురాలోచనల చేసెదవేల?

నేను జెప్పునట్టి విషయములు నీవు నాలోచింపుము. ఈ వానరులు చలచిత్తులు. వీరిని నమ్మి నీవొకకార్యము కరుఁ గడంగితివా నట్టేటబుట్టి ముంచుదురు. ఈలోపలనే వారిమనస్సులు మాఱుటకంటివికదా. వీరెన్నా ళ్ళు పెండ్లాను బిడ్డలను వదలి నీసేవ చేయుచుందురని తలంచితివి ? నీవు వారికిచ్చు జీతము బత్తెమంత? ఆఁకలిదప్పుల నల్లాడుచు నీవెంట నెన్నాళ్ళు దిరుగు చుందురు? ఎప్పుడు విసుఁగు దోఁచునో యెప్పు డాలుబిడ్డల మీఁద మరులు దొరలనో యానాఁడే చెప్పకుండ వెడలిపోదురు. ఒకని వెంట నొకఁ డందఱు వెడలిపోవ నొంటరి వాఁడవై గాలికి వణకు గడ్డిపోఁచవలె వణఁకుచుందువు. అట్టి నిన్ను లక్ష్మణుశరములు చీల్పక తాలునా? బిలములో దాఁగుట మేలని యొకఁడు చెప్పెను. శతకోటి శతకోటులతో సమానము లయిన యస్త్రములు లక్ష్మణునొద్ద నున్నవి. ఆ బిలము నొకయస్త్రముచే దొప్పవలె నాయన చెక్కివేయకుండునా? తరువాత నీగతిత యేమి?

కం. బలహీనులతోఁ బగ గొని
బలవంతుఁడు బ్రతకఁగలఁడు వాలితనుజా !
యిల బ్రతుక వాంఛ గలిగిన
బలహీనుఁడు బలియుతోడఁ బగగొనఁ దగునే.

అంతియుగాక నీపిన్నతండ్రి నిన్ను వధించునని వృధాభయపడెదవు. సుగ్రీవుఁడు నీమేలు కోరువాఁడు ధర్మకాముఁడు శుద్ధుఁడు దృఢవ్రతుఁడు. సత్యప్రతిజ్ఞుఁడు నామాట నమ్ముము. నిన్నెప్పుడునువధింప సుగ్రీ వుఁడు తలఁపడు. అంతియకాదు. అతఁడు బిడ్డలు లేనివాఁడు. నీవే యతనికిని పుత్రుఁడవు. నీతల్లి యందెక్కువ మక్కువ గలవాఁడు. ఆ నిమిత్తముగనైన నిన్నతండు వధింపఁడు. కావున మరలి కిష్కింధకుఁ బోదమనిన నంగదుఁ డతని నవినయము రాజసత్కారయుతము ధర్మ్యమునైన వాక్కులాలించి యిట్లనియె.

హనుమంతా ! నీవు ప్రభుభక్తియు,నాయందనురక్తియు,శక్తియుఁ గలవాఁడవని యెఱుంగుదును గాని నీ యుక్తిమాత్రము యుక్తముగ నాకుఁదోఁపలేదు. ఇంతదూరమైన పిమ్మట నిఁకదాఁపనేల? నామనస్సున నుండునది యంతయుఁ జెప్పెద వినుము. నీవు సుగ్రీవు నేమో పొగడితివిగాని స్థైర్యము ఆత్మశుద్ధి ఆర్జవము దయ ధైర్యము విక్రమము ఇవి సుగ్రీవునందు లేమి వింత గాదు అన్న భార్యతో సంగమముఁజేయు నీచుఁ డను గౌరవార్హుఁడా ! నీవు ద్వారముగాచి వెలుపలి శత్రువులను లోనికి రానీయకు. మని యన్నచెప్పిన సరియని యంగీకరించి తానే యా ద్వారము మూసి వచ్చువాఁడు యోగ్యుడా ? చేతిలోఁ జేయివైచి రామునకుఁ బ్రమాణముచేసి తన కార్యమయిన తరువాత మేలుమఱుచువాఁడు కృతజ్ఞుఁడా? సీతాదేవిని వెదక వానరు లను సుగ్రీవుఁ డంపుట లక్ష్మణు భీతిచేఁ గాని ధర్మము నందలి ప్రీతిచేఁగాదు. చల చిత్తుఁడు స్మృతిహీనుఁడు కలుషాత్ముఁడు కృతఘ్నుఁడు నగు వానిని బ్రతుకఁ గోరువాఁ డెవఁడు నమ్మును? నేనతనికిఁ బుత్రుఁడనని నాకారజ్య మిచ్చునని యంటివి. గుణవంఁతుడో గుణహీనుఁడో తన కొడుకునకుఁ దన రాజ్య మిచ్చునుగాని వైరి కుమారునకు రాజ్యమిచ్చువాఁ డెందుఁ గలఁడు ?ఇఁక దనకుఁ బుత్రులు గలిగిన నేను రాజ్యము హరింతునని నన్ను వధింపనైన వధించును లేక బంధనాలయమున నైన బ్రతికినంత కాలము ద్రోయును గాని నన్నేల యతఁడు బ్రతుకనిచ్చును?హనుమంతా ! నామనస్సులో నున్నదంతయు వెడలఁగ్రక్కితిని. ఇఁక నాకు బ్రతుకు మార్గము లేదు. నేను కిష్కింధకు రాను. వానరులారా ! మీకందఱకు సెలవిచ్చితిని. మీరు మీ మీ యిండ్లకుఁ బోవచ్చును. మీరు కిష్కింధకుఁబోయి నా పినతండ్రియగు సుగ్రీవునికి నామాఱుగ మ్రొక్కుఁడు నాతల్లి రుమకు నామాఱుగ పదముల వ్రాలి నమస్కరింపుఁడు. అట్టులే నాతల్లి తారకును అభివాదనము గావింపుడు. ఇఁక నన్ను వదలిపొండని పెద్దవారికెల్ల నమస్కరించి సముద్రతీరమున దర్భలు పఱిచి ప్రాయో పవేశము గావించెను. తక్కినవారు నట్లే గావించి రామ వనవాసము దశరథుని మృతి సీతాహరణము జటా యువధయు వాలిమరణము రామకోపము వానరులకుఁ గలిగిన భయము లోనగునని మాటలాడుకొనుచు తమకుఁ బ్రాప్తించిన కష్టమునకై హెూ యని యేడ్చిరి. వారల మాటలను వారి దుఃఖమును విని వారిని సంహరించి తినఁ గోరి కొండమీఁదనుండి వచ్చుచుండిన సంపాతియను గృధ్రరాజు జటాయు సోదరుఁడు జటాయు మరణవార్తవిని వానరులయెద్దకు వచ్చి తద్వృత్తాంతమంతయు నెఱింగి తాను జటాయు సోదరుఁ డగుట తెలిపి సీత లంకయందు రావణు నంతఃపురమున నున్నది. సముద్రము దాఁటుటకై యత్నింపుఁడని చెప్పిపోయెను.

వానురులందఱా వార్తవిని సంతోషమునలేచిరి. అంగదుఁడు బలపరాక్రమ సంపన్నులైన వానరవీరుల

నెల్ల సభగూర్చి యిట్లనియె.

వానురులారా ! సీత లంకయం దుండుట వాస్తవమని తెలిసెను. ఇఁక సముద్రము దాఁటి పోకున్న లోపము మనదే. మనకవమానము నపాయమును గలుగును.

సీ. ఏమహాతేజుఁడో యీసాగరము దాఁటి
శైలాటపతి సత్యసంధుఁ జేయు
నే మహాబలుఁడొ నుఱామడ లంఘించి
ప్లవగులభయ మెల్లఁ బాప నోపు
నెవ్వనిమహిమచే నిటనుండి చని యింట
నాలుబిడ్డలఁగూడి యలరఁ గలుగు
నెవ్వనికరుణచే నెలమి సుగ్రీవుని
రామలక్ష్మణులఁ జేరంగఁ గలమొ

తే. యట్టి సామర్థ్యము గల హరివరుండు
సాగరంబును లంఘింపఁ జాలువాఁడు
గలిగెనేనియు నీసైన్యకాండములకు
సభయదక్షిణ నొసఁగుత మాశుగతిని.

అని తారానందనుం డాడిన నొకవానరుఁ డేనియు నోరు మెదలించినవాఁడు కాడు. వారిస్థితి చూచి కీశవరులారా ! మీరు మహాసాహసురుల బలపరాక్రమ సంపన్నులరు. ఎంత కార్యమైనఁ జేయ సమర్థులరు. సుగ్రీవునెదుట నన్ని ప్రగల్భములు పలికి వచ్చి యిచ్చట సముద్రమును జూచి మౌనము వహించినఁ గార్యమెట్లగును ? కావునమీరొకరొక రెంతదవ్వు దాఁటఁగలవారో మీశక్తి యాలోచించి చెప్పుఁ డనిన గజుడు నేను పదియోజనములు దాఁటఁగల ననియె. గవాక్షుఁ డిరు వదియు, గవయుఁడు ముప్పదియు. శరభుఁడు నలువదియు, గంధమాదనుఁడు ఏఁబదియు, మైందుఁ డఱువదియు, ద్వివిదుఁడు డెబ్బది, సుషేణుఁ డెనుబది జాంబవంతుఁడు తొంబదియు నామడదాఁటఁగలనుగాని మరలి రాఁగలనో లేనో యని మనశక్తు లింతమాత్రమే యైనఁ గార్య మెట్లు సఫలమగునని విచారపడుచుండెను. అప్పుడు జాంబవంతుఁడు యువరాజా ! నీవు విచారపడవలసిన పనిలేదు. నీవు సముద్రము దాఁటుపనియు లేదు. మేమిందఱము చక్కనుండ రాజగు నిన్నుఁ బంపనురాదు. అట్లైనఁ గార్య మెట్లగు నందేవేమో. దానిని సాధింపఁగల వాఁడు మనయం దొక్కడున్నాడు. వానిని ప్రేరించెదనని యేకాంతముననుండి యేమియో యాలోచించుచున్న యాంజనేయ నొద్దకుఁ బోయి జాంబవంతుఁ డిట్లనియె.

హనుమంతా ! యేమిటు తేరకానివలె నేకాంతమునఁ గూర్చుండి యేమియో యాలోచించుచున్నాఁ డవు. సీతను వెదకుకార్యమున భారమంతయు సుగ్రీవుఁడును శ్రీరాముఁడును నీ భుజములపై నిడుట మఱచితివా ? లేక వారు నీశక్తి సామర్థ్యము లెఱుఁగక నిన్నీ కార్యమున నియోగించిరని తలఁచితివా? లేక మేము నీబలపరాక్రమములు తెలియనివారమని యెంచితివా? ఈవానరులందఱు నిచ్చట మరణించుటే శ్రేయమని భావించితివా ? కార్యసాధనశక్తి లేమి మేమిట్టి యపకీర్తినైన సహించెదము గాని మమ్ముఁ గలసి నీవును వడ్లతో తట్ట యెండినట్లు అపకీర్తి నెట్లు సహించెదవు ?

ఉ. ప్రాకట సర్వశాస్త్రచణ ! వానరవీరవరేణ్య ! పావనీ! యేకత
మిట్లు మౌనము వహించి రమించుచు మాటలాడ వేలా?
కమలాప్త సూనునకు నా రఘు వీరులకున్ బలంబునన్.
వీకునఁ దేజునంబురుడు నీవవుదెంతయు నెంచి చూచినన్

సీ. వినతా తనూజుండు విదితమహాబలుం
డాకశ్యపుని సుతం డండజాత
కాంతుండు గరుటాల మంతుఁడు నీరధిఁ
బాముల హరియించి పఱచుచుండ
నెన్నిమాఱులో కంటి నన్నీడజేంద్రుని
పక్షంబులకుఁ గలబలము జవము

నీబాహులకుఁ గల్గు నిక్కంబు వానికి
వీసమంతైనను దీసిపోవు

తే. తేజమున బుద్ధిబలమున ధృతిని జగతి
నెల్లవారలకంటెను నెక్కు డీవు
నిన్ను నీవేల యెఱుఁగవు నిర్మలాత్మ !
యేమి కత మిది యోజింపుమో మహాత్మా !

అని యాంజనేయుని వీఁపు చఱచుచు వానరులతో నిట్లనియె. వానరేంద్రులారా ! మన యాంజనేయుఁడు మనలోఁ గలిసి యున్నంతమాత్రముచే మన యట్టివాఁడని తలంపవలదు. గులకరాలతోఁ గలిసియుండినంతనే వజ్రము గులకరాయి యగునా ? ఈ మహాబలనందనుని బలపరాక్రమంబులు మీరె ఱుంగరు. నే నెఱుంగుదును. ఈయన శైశవంబునఁ జేసిన కార్యమెఱింగిన నీతుచ్ఛ సముద్రదలంఘనం బితనికి గొప్పదంబును గాదు. ఒక యంజలోనికి లేదు. పుంజికస్థలయను దేవతాకన్య శాపవశమున నంజన యనుపేరఁ గీశకాంతయై కుంజరుఁడను కపికుంజరునకుఁ గూతురై కేసరియను కిశకేసరికి నాలైకామరూ పంబు ధరింప నేర్పగలిగి ప్రసిద్ధివహించెను. ఆ గుణధన్య యెక్కనాఁడు మనుష్యస్త్రీ రూపము ధరించి నానా మంజుల భూషణంబుల దాల్చి యొక శైలశిఖరంబున సంచరించుచుండెను. ఆమెను జగత్ప్రాణుండు కౌఁ గిలించెను. ఆమె స్పర్శమున నెఱింగి యెవ్వఁడురా నాపాతివ్రత్యముఁ జెఱుపఁ దలంచు దుష్టుఁడని కోపించి పలుక నక్కలికితోఁ బవనదేవుఁ డిట్లనియె. కాంతామణీ! నేను వాయుభట్టారకుఁడను భయపడకుము. నావలన నీశీలమునకు హాని రాదు. నాయనుగ్రహమున

కం. ప్లవవనంబున లంఘనమున
నవలా ! మత్సముఁడు నీకు నందనుఁడు మహా
జవనుఁడు పరాక్రమాఢ్యుం
డవితథసత్త్వుండు ప్రాజ్ఞుఁ డంగన్ ! కలుగున్.

అని వరమిచ్చిపోయెను. ఆ వరబలమున నాంజనేయా! నీవామె యుదరంబున శుక్తికి మౌక్తికమువలె జనించితివి.

నీ వొకనాఁ డుదయించు సూర్యుని బాల్యచాపలముచే పండని తలంచి మూఁడునూర్ల యోజనములు మింటికి లఘించిన శచీపతి కోపించి వజ్రంబున నిన్నుఁగొట్టిన నీవామహనువు భగ్నమై మూర్ఛిల్లితివి. నిన్ను నీ తండ్రి కొనివచ్చి గుహయందుంచి జగంబుల నాత్మసంచార మెల్ల నుడివిన బ్రహ్మాదిదేవత లరుదెంచి నీ కమోఘంబులైనవరంబు లొసంగిరి. ఇంద్రుఁడు నీకు స్వచ్ఛందమరణం బొసఁగె. ఇదియంతయు మఱచితివో మే మెవ్వరెఱుఁగ మని తఁలచితివో నాయనా ! మాకందఱకుఁ బ్రాణములు పోవుచున్నవి. దయామూర్తీ! మాకుఁ బ్రాణభిక్ష నిమ్ము. నీవు తప్ప మాకు వేఱుగతిలేదు. వాయుజా! నేనును బూర్వమున నా కాలమువారిలో బలపరాక్రమవేగంబులఁ బ్రసిద్ధికెక్కిన వాఁడను. త్రివిక్రమావతారమున విష్ణుమూర్తి నిఱువదియొక్కమాఱు ప్రదక్షిణించితిని. అమృతమునకై దేవాసురులు పాలసముద్రమును జిలుకునెడ వలసినయోషధులనెల్ల నేన సేకరించితి. ఆ కాలము పోయినది. కాలము కొలఁది జవసత్త్వంబు లుడుగున పెద్దవాఁడనైతిని. మోఁకాటఁ గొండ విఱుగుటచే గమనము కుంటుపడినది. కావున హీనబలుఁడనైతిని. అది యెల్ల నిప్పుడు చింతించి ప్రయోజన మేమి.

కం. లెమ్మా హరిశార్దూలా!
యిమ్మహితార్ణవము దాఁటుమీ ప్లవగానీ
కమ్ములు యుష్మజ్జవ వీ
ర్యమ్ములఁ గనుఁగొనెదునాసఁ గ్రాలెడి నసఘా!

కం. మున్ను త్రివిక్రమ పోలిక
సన్నుతమగు నీదుశక్తి సకలముఁ జూపన్
గన్నారఁ జూడఁ గోరెద
రన్నా ! కపివరు లుపేక్ష యర్హమె సెయన్ ?

నీతండ్రి జగత్ప్రాణంబైయుండ నీవు మా ప్రాణంబులు రక్షించు టెంతకార్యంబని ప్రోత్సాహవాక్యంబులు

పలికిన నవ్వాక్యంబులు విని హనుమంతుఁడు దుప్పొంగి హుమ్మనిలేచి హర్షించి విజృంభించి దేహము పెంచి బాహులప్పళించి వాలంబు నేలఁదాటించి నిండుకన్నుల వానరా నీకంబువీక్షించి సముద్రలంఘనంబున కుత్సాహంబు వాటించిన యతని తెఱంగు పలక్షించి వానరు లెల్ల సంతోషించి కిలారించి గంతులు వైచి జయజయ హనుమంతా! జయజయ ఆంజనేయా ! జయజయ పవమాన నందనా ! యని ప్రశంసించిరి. వారు ప్రశంసించు కొలఁది హనుమంతుఁడును రేఁగి త్రివిక్రమావతారంబున నారాయణునట్టులు దేహముపెంచి చంద్రనిప్పులఁబోలు కన్నులును నెఱ్ఱఁగ గ్రాఁగిన యినుప పెనముంబోలు ముఖము నుదయించు సూర్యబింబమును బోల భుజమప్పళించి వృద్ధవానరులకెల్ల శిరంబువంచి నమస్కరించి యిట్లనియె.

వానరేంద్రులారా ! యిప్పుడేమిచేయ నన్నాజ్ఞాపించెదరు. మేరు పర్వతము నెత్తుదునా? రాక్షసులఁ బడమొత్తుదునా? భూచక్రంబును సముద్రములో ముంతునా? కొండలు పిండిదంతునా? లంకానగరంబు మెట్టుదునా? రావణుఁ నలఁగ గొట్టుదునా? మేరుగిరికిఁ బ్రదక్షణము వత్తునా? వజ్రధరుచేతి యమృత కలశముఁ దెత్తునా? ఇచ్చటి నుండి యుదయించు సూర్యునొద్దకునేగి యతనికి వేమాఱుప్రదక్షిణించి యాయన యస్తమింపకముందె మరల నిచ్చటికి వత్తునా?

ఉ. ఇంతలు తున్కలై చెడఁగ నీయిలఁజీల్లునొ, సాగరంబునెం
డింతునొ పర్వతంబులను నెట్టన చేతులఁ బిండి పిండిగా
దంతునొ,నూరువేగమున దారుణనీరధి నాదువెంట ర
ప్పింతునొ,యేమి యెంచితిరి భీషణకాయుని నాంజనేయునిన్

బలవిక్రమజవంబుల నేను నాతండ్రికి సమానుఁడను ఱువ్వన పైకెగయుచుఁ గ్రిందికి దిగుచు నాకసంబున నేనేగునపుడు నా వేగంబునకు వేళ్ళతోడ భూమినుండి లేచిన కుసుమితతరులతా వితానంబులు నా వెంట రాఁగా దూరమున నుండువారు నామార్గము నక్షత్రమార్గమని భ్రమించి నివ్వెఱ చూచుచుందురు గాని వాయుభట్టారకుఁడు గరుడుఁడు దక్కనొకరైన నావెంట రాఁజాలరు. మెఱుఁగు మెఱిసినట్లు చివాలున గగనంబున కెగసి నిరాలంబముగఁ బోవుచుఁ ద్రివిక్రము భంగిని విరాజిల్లెదను. గరుడానిలవేగంబున వేయి యోజనములలైన దాఁటఁగలను. ఇఁకఁ నూఱుయోజనము లేమిలెక్క?

కం. నడిఁకించుచుఁ బర్వతముల
నుడికించుచు సాగరంబు నుద్దవిడిన్ నే
నడఁగించుచు మేఘంబులఁ
గడలిని దరియింతుఁ గనుఁడు కపిసింహంబుల్.

కం. వీడుఁడు చింతల ముదముం
గూడుఁడు ప్లవగేంద్రులార! కోమలిఁ గాంతున్
వీడని బుద్ధిబలంబునఁ
గీడొదువదు మనసు చేష్ట కెరలెడి నిట్టుల్.

కం. లంకను బాఁ తగలఁగ నక
లంకగతిం బెఱికి వెంట లాగుకొని చనన్
బింకమున నేర్తు నని ని
శ్శంకంబుగఁ దోఁచెఁ బ్లవగసత్తములారా !

అని గర్జించినఁ గపులందఱు నమందానందంబునఁ గుందుపాసిరి. జాంబవంతుడును హనుమంతుం జూచి వాయునందనా! ఆంజనేయా ! కపిలోకవీరా ! నాయనా ! మాకందఱకుఁ బ్రాణము లొసంగితివి. నీకుఁ గార్యసాఫల్యం బొదవ వానరులెల్ల మంగళా శాసములు గావించుచున్నారు. మునుల ప్రసాదంబునను గురుల కరుణను గపివృద్ధుల మతిని నీవు సముద్రముదాఁటి శాశ్వతకీర్తి గడింపుము. అనిన నాంజనయుఁ డట్లులగుఁగాక. నే నెగురు వేగంబు నీ భూమి సహింపఁ జాలదు. మహేంద్రనగంబున కేగుదమని సమస్త కపివీరుల తోడరాఁగ మహేంద్రనగం బెక్కెను.

రుక్మిణి– సుగ్రీవుని యెదుట వానరు లందరు నేను నూఱామడ దాఁటెదను నేను వేయామడ దాఁటెద నని డంబములు పలికెరే. ఇప్పుడు నేను బది నేనిరువదియని చెప్పిరే ముందు చెప్పినది యబద్ధమా? యిప్పుడు చెప్పినది యబద్ధమా?

తండ్రి– కొందఱు ముందు వీరావేశముచేఁ జెప్పిరి.కొందఱు శక్తిగలిగి యిప్పుడు వెనుకంజ వేసిరి.కాని యందఱు వివేకులే ఏలనెదనా? విను.సంపాతి రావణునియతః పురములో సీత యున్నదని చెప్పెను అట్లుండ సముద్రము దాఁటినంత మాత్రముచేతనే ప్రయోజనమేమి? రావణుఁడు సామాన్యుడుగాడఁని వారంద ఱెఱుఁగుదురు.కాఁబట్టి చేయవలసిన కార్యములందు సముద్రము దాఁటుటొక్కటే ముఖ్యకారముగాదు.ఆది వారాలోచించి దీనికిఁ దగినవాడు హనుమంతుఁడే.ఆయన పోవుటయేబాగని యందఱు వెనుకంజవేసిరి గాని వాస్తవముగ శక్తిలేకకాదు.సేతువు కట్టినను కొంద ఱాకాశమున నెగిరి యావలియొడ్డునకు పోయిరి గదా?

ఇట్లు మహేంద్రనగం బెక్కి యాంజనేయుండుత్సాహాతిరేకంబున పర్వతంబును రెండుచేతులఁ బట్టియూఁగు లాడించెను.ఆ బలమునకుఁ దాళఁజాలక యచలంబయ్యు నయ్యది యిసుకను బాతిన స్తంభమువలెఁ నూఁగులాడెను.వృక్షమందలి పుష్పబృందములన్నియు నేలరాలఁ బర్వతమంతయుఁ బుష్పమ యమ్మగఁ దోఁచెను.మదవారిఁగార్చు నేనుఁగుకరణి నాధరణీధరము కొండవంకలనుండి నీటిధారలఁ గ్రక్కెను.గడగడవడఁకుపర్వతము నడుమనుండి వెండి పైఁడి లోనగు లోహముల పొరచాళ్ళు వెలువడెను.వడ వడవడఁకు కొండగుహల నుండఁజాలక వన్యమృగములు రొదలు చేయుచు వెలికివచ్చి పొదలకై పాఱఁబొచ్చె ను.ఘోరసర్పములు నిలువఁజాలక పొర్లుచు రోషమున నచటి పాషాణంబులఁ గఱచెను.ఆశైలమందలి విషహారంబులగు మూలికలు సహితము తద్విషవేగము హరింపఁ జాలవయ్యెను.కొండబ్రద్దలువాఱునో యని గుండెలు పగిలి కిన్నర కింపురుషులు ప్రియలతో గగనమున కుద్గమించి యచ్చెరపాటునఁ జూచుచుం డిరి.అప్పుడాంజనేయుండు

సీ. పరిఘభంబులౌ బాహువుల్ స్తంభించి
భుజములు మెడయును బొరి ముడించి
మోకాళు లర్థంబు ముంగలగా వంచి
పాదముల్ జోడించి వడిఁ గుదించి
వీనుల స్రుక్కించి పెదవుల బిగియించి
కటిభాగము లోనుగాఁగఁ గుంచి
కనుఱెప్ప లెగయించి కడు దవ్వు దిలకించి
యుర్వీధ్రమునఁ గాళ్లు లూఁది యుంచి
గీ. యూర్పు బిగియించి తమిమీఱ సురవడించి
బయలఁ జూపు గదించి నిర్భయత మించి
కార్యముఁ దలంచి తనపరాక్రమము నెంచి
పెంపు వహించి యట్టె కుప్పించి యెగసె.

ఇట్లు గగనంబున కెగయుచు యివ్వనచరవరుండు గండు మిఱి తోడివారిం జూచి

ఉ. చెచ్చెర వాయువేగ మగు శ్రీరఘురామ శరంబు నట్లు నేఁ
బోచ్చెద లంకనందు నృపసుందరి గన్బడకున్న నాకముం
బొచ్చెద నిట్టెనందు సతిఁ జూడమిఁ గల్గినఁ బట్టి రావణుం
దెచ్చెద నెట్టులైన నృపుదేవిని దోడ్కొని వచ్చెదంజుఁడీ.
కం. తెచ్చెదద లంకను నిచ్చటికిఁ
గ్రొచ్చెద రావణునిబట్టి క్రూరతమై నే
వచ్చెద సెల విచ్చెదరే
హెచ్చెదఁ గృతకృత్యతను గపీశ్వరులారా.

అని చివ్వుననెగసి గరుత్మంతునివలె ఱివ్వునఁ బోఁజొచ్చెను.అమ్మహాబలు మహావేగంబునకు వృక్షం బులన్నియు వేళ్ళతోడ నెగసి యతనితోఁడ నెయ్యుని సాగనంపు చుట్టంబుల వలెఁ బోవ నందుండి రాలిన పుష్పంబులచే పారావారంబు తారావారంబుచే నిండిన యాకాశంబుఁ బోలియుండెను.సారవంతములైనద్రు మంబులు దూరం బరుగలేక వజ్రహతిఁ దెరలు గిరులవలె జలనిధి గుబాలునంబడి మునిఁగె.ఆకాశంబునఁ బోవు హనుమంతుని చాఁచిన కరంబులు పర్వత శిఖరంబుల నుండి పడగలు నిక్కఁబెట్టు నైదుతలలపాముల



హనుమంతుఁడు సముద్రమును దాఁటుట

వలెఁ దోఁచుచుండెను. ఆయన నేత్రములు కాలెడికొండలమంటలో యేకకాలంబున నుదయించిన సూర్యబింబంబులో యన నెఱ్ఱనై వెలుంగుచుండె. ఉత్తరమునుండి దక్షిణమున కేగెడితోఁకచుక్కలవలె హనుమంతుండు వడిసెలఱాయివలె ఱివ్వునఁబోవుచుండెను. అంబరమార్గంబున నంబుధర మధ్యంబునఁ గొంత కానవచ్చియుఁ గొంత కానరాక రాకాచంద్రునివలెఁబోవు నమ్మహాత్మునిఁ జూచి బళిబళీ యాంజనేయా! మేలు మేలు హనుమంతా ! బాపురే కపీంద్రా! చాంగుబళీ వాయునందనా ! యని దేవతలు మునులు మింట నిలిచి ప్రశంసించిరి.

**మైనాకుఁడు హనుమంతున కడ్డముగ వచ్చుట :-**

అప్పుడు సముద్రుఁడు తనలోఁ దా నిట్టులాలోచించెను. సగరకుమారులవలన నభివృద్ధి నొంది సాగరమను ఖ్యాతిఁగాంచిన నేను వారి వంశమును జనించిన మహానుభావుఁడగు రాముని కార్యార్థమై పోవు నీయాంజనేయునకు సాహ్యము చేయకుండిన లోకులందఱుఁ గృతఘ్నుఁడ నని నన్నుఁ జీకొట్టకుం దురా ! కావున నీయనకుఁ దోడుపడ నాలోచించెద నని తనలో దాఁగియుండిన మైనాకపర్వతమును జూచి నగోత్తమా ! నీవు వాయుదేవునిపట్లఁ గృతజ్ఞత ప్రకటించుకాలము వచ్చినది. వాయుకుమారుండు రామకార్యార్థమై శతయోజనంబులు దాఁట నుద్యమించి మింట నరుగుచున్నాఁడు. అతనికి నీవు విశ్రమస్థానమైతివేని యతనికి లంఘనకార్యము సుకరంబగును. గావునఁ బొమ్మనిన నదియును చివాలున నాకసంబున కెగిరి యా హరిపుంగవు మార్గమధ్యంబున నిలిచెను. తనమార్గంబున కడ్డంబుగ నొక కొండవచ్చి నిలుచుటచూచి యది తనకార్యము విఘ్నపఱుప వచ్చెనని తలంచి రెట్టించిన వేగంబున వచ్చి ఢీకీలునఁ దాఁకెను. పిడుగువంటి యా తాఁకున కాపర్వతము దద్దఱిల్లి సొమ్మసిల్లి తెప్పిఱి మనుష్యరూపంబున శిఖరంబుపై నిలిచి పేరెత్తి పేరెలుంగునఁ బిలిచి యాతనితో నిట్లనియె.

పవమాననందనా ! నీకు నేను మిత్రుఁడుగాని శత్రుఁడనుగాను. నామాటవిని మఱి చనుము. సీతాఁకున నేను వితాకుగొనినను నీబలంబు దలంచి యలరుచున్నాఁడను. నేను నిష్కారణముగ నీకడ్డముగ వచ్చినవాఁడను గాను. కృతజ్ఞుఁడైన సాగరుఁ డుపకారబుద్ధి నీకుఁ దోడ్పడ నన్నుఁ బంచెను. అతని కడకు నీవు వచ్చితివిగావున వీవతని కతిథివైతివి. కావునను రామకార్యమునకై నీవు పోవుచున్నావు గనుకను నిన్ను సత్కరింప నీకొకింత విశ్రాంతి గలిగింప నన్నుఁ బంచెను. నీవు నాశిఖరంబున నొకింతసేపు నిలిచి వలసిన ఫలాదు లారగించి సేదదేఱి మఱిచనుము. నీకుఁ గార్యసిద్ధియగును. సామాన్యులయిన యతిథులే పూజార్హు లగుచుండ నీయట్టి వాని విషయమై చెప్పనేల? ఆంజనేయా ! నేను నీకుఁ గ్రొత్తవాఁడనుగాను. మనకుఁగలబంధుత్వసంబంధంబు వినుము. కృతయుగమునఁ బర్వతములు ఱెక్కలుగలవై యెగురుచుండ లోకులందఱు భయపడుచుండిరి. దానిని జూచి యింద్రుండు వజ్రాయుధముచేఁ గొండల ఱెక్కల నెల్ల ఖండింపఁ జొచ్చెను. అప్పుడు భయపడుచున్న నన్ను నీతండ్రి కొనివచ్చి యిందుఁ జేర్చెను. నాఁటనుండి నిర్భయుఁడనై యున్నవాఁడను. నిన్నిపుడు పూజించిన

నీతండ్రిని బూజించినట్లయగు. నాయాతిథ్యం బంగీకరింపుమని వేఁడు మైనాకునిఁ జూచి నగేంద్రా ! నీవుచేయు సపర్యలు గ్రహించితినని భావింపుము. నేను మార్గమందు నిలువ నని వానరులతోఁ బ్రతిజ్ఞయొనర్చినాఁడను గావున నిలువరాదు. క్షమింపుమని దానిఁదన కరంబున గౌరవ సూచకంబుగ నంటి మరల మింటి కెగసి పోఁజొచ్చెను.

రుక్మిణి– నడిత్రోవలో నేను నిలువనని హనుమంతుఁడు వానరులతోఁ జెప్పలేదుగదా. ఇప్పుడది యొక నెపముగఁ జెప్పుట యసత్యమాడుట యవునా కాదా?

తండ్రి– ఉద్గ్రంథము లర్థము చేసికొనలేక దురాక్షేపములు చేయువారు నీయట్టివారే. అల్పులు తమ తెలివితక్కువను మహాపురుషులయం దారోపింతురు. హనుమంతుఁడు వానరులతో శ్రీరాముని శరమువలెఁ బోయి వచ్చెద నని చెప్పెనా లేదా ? దానికేమి యర్థము గ్రహించితివి? వింటనుండి వెలువడిన బాణము మార్గ మధ్యమున నిలుచునా?

రుక్మిణి– అటైన నేబాణమైనఁ జాలును. రామ బాణమననేల!

తండ్రి– రామబాణము వ్యర్థము పోదు. కార్యము సాధించి మరలఁ బొదికి వచ్చుచుండును. అట్టులే తానుఁద్రోవలో నిలువక శీఘ్రగమనమునఁబోయి కార్యము సాధించి మరలి వచ్చెద నని యర్థము.

రుక్మిణి– ప్రతివాక్యమున కీప్రకార మర్థము గ్రహింపవలయుననిన మాకు శక్యమా ?

తండ్రి– అర్థము గ్రహింప శక్తి లేకున్న దురాక్షేపము చేయకుండుటకు శక్తి లేదా? ఇట్టి సందర్భములలో తెలివిగల వారు చేయవలసిన దేమనగాఁ ఇంతటి గొప్పవా రిట్టి చేయరానికార్యము చేయుదురా ? చేయరు. అటైన దీని కేదైనఁ దగిన సమాధాన ముండును. అని పరిశోధింపవలయును పరిశోధించి తెలిసికొనఁజాలు శక్తి లేకున్న నొకరి నడిగి తెలిసికొనువఱకు మన యభిప్రాయమే పొరపాటని యూరకుండవలయును గాని గొప్పవారిపట్ల దోష మారోపించుట శ్రేయస్కరము గాదు. బుద్ధిమంతుఁడు చమత్కారముగ మాటలాడును. దానిని బుద్ధిహీనుఁడు గ్రహింప లేడు. ఆకారణముచే బుద్ధిమంతుఁడు దూష్యుఁడా ? తనకు దెలియని వన్నియుఁ దప్పులను విపరీత బుద్ధిమతులలో మీరు చేరవలదు.

ఇట్లు హనుమంతుని రెండవ యద్భుత కార్యముఁ జూచి దేవతలు సంతోషించియు నితఁడు సముద్రము దాఁటగలడోలేఁడో, దాటినను ఇతనికి మహాబలశాలియగు రావణు నెదిరింపఁజాలుమతి శక్తిగలదో లేదో యని బరీక్షింపఁ గోరి నాగమాతయైన సురసంజూచి యిట్లనిరి. దేవీ! నీవు దైత్యకాంతవై భయంకరమైన భూరిస్వరూపము ధరించి హనుమంతుని త్రోవకడ్డముగ నిలువుము. నిన్ను మీఱిపోఁగలడో లేక చిక్కుపడునో చూతమని పంపిన దేవకాంతయు భీకరాకారమునఁ దాల్చి పోయి హనుమకడ్డముగా నిల్చి యిట్లనియె. ఓ కపీంద్రా! నిలు నిలుము నన్ను దాఁటి నీవెందుఁ బోఁగలవు. దేవతలు నిన్ను నాకు భోజ్యముగ విధించిరి. నా వాతఁబడక పోవ నీకు శక్యముగాదు. బ్రహ్మ నా కిట్టివర మొసంగెను నానోరఁ జొరఁబడుము. మ్రింగుదు ననిన నాంజనేయుఁ డామెకు నమస్కరించి దాక్షాయణీ! నా నమస్కారము గ్రహించి శమింపుము. రామకార్యా

**సురస హనుమంతుని మ్రింగుట**



ర్థమై పోవుచున్నాను. నీవు రాముని రాజ్యమందుండుటచే నీకునురామకార్యము కర్తవ్యమే కదా. అటుగాదేవి నేను లంకకుఁబోయి జానకిని జూచి యావార్త రామునకుఁ దెలిపి మరలివచ్చి నీకాహారమయ్యెదనని నదివ్వి యివేటి మాటలు? నన్నా నీవు మోసగించి పోఁజూచెదవని యోజనము వెడలుపున నోరువిచ్చెను. ఈమె దేవకాంత. ఈమెను నొప్పింపరాదు. ఈమెతోఁ గలహింపను రాదు. సదుపాయముచే నీమెను మెచ్చఁజేసి పోయెద నని తలఁచి యగుష్ఠమాత్రదేహుఁడై తటాలున నోటిలో దుమికి యావలికి వెలికి దాఁటి యామెను జూచి నమస్కరించి దేవీ నీకుకోరినట్లు నీవాతఁబడితిని. బ్రహ్మవరము సార్థకమయ్యెను. ఇఁక నన్ను క్షమింపుము. పోయివచ్చెదనని నామె సంతోషించి నిజరూపము ధరించి మేలు మేలు హనుమంతా ! నిన్ను మెచ్చితిని. నేను దేవతల పనుపున నిన్నుఁ బరీక్షింప వచ్చితిని. నీకు సకల కార్యములు సుసాధములు. పోయిరమ్మని దీవించి యథేచ్ఛమేగెను. హనుమంతుఁడును గరుడానిలవేగుఁడై విజృంభించి మహాకారంబు వహించి పోవుచుండ నతని వేగము కుంటుపడెను. ఇట్లున్నట్టుండి తనవేగము హీనము కాఁగా నే మిదియాశ్చర్యమని నాలుగు ప్రక్కలు చూచెను గాని యెందు నెవ్వరు గానరారైరి. తరువాతఁ గ్రిందివైపు చూడ సముద్రము నుండి యొక రక్కసి వెలువడుచుండెను దానిని జూచి యాంజనేయుఁడు సుగ్రీవుఁడు చెప్పిన సింహిక యిదియే కాఁబోలు కావుననే నా ఛాయనుబట్టి నన్ను నాకర్షించుచున్నది యని తలంచి తన దేహము మఱింత పెంచెను. అదియును మహాభూత మబ్బెనని సంతోషించి నోరుపెంచెను. ఇట్లు నోరు పెంచిన రాక్షసిఁజూచి యంగుష్ఠమాత్ర దేహుఁడై దాని యుదరమునఁ జొచ్చి ప్రేగులుద్రెంచిఁకేలగొని వెలువడెను. ఆ వేదనచే నది చచ్చెను. ఈ యద్భుతకార్యముఁ జూచి దేవతలెల్ల సంతసించిరి. తరువాతఁ గొంతదూరము పోఁగా లంక గాన వచ్చుచుండెను. ఇఁక నీ మహాస్వరూపముతోఁ బోయిన రాక్షసులు తెలిసికొందురని తలంచి సూక్ష్మశరీరుఁడై యావలి యొడ్డున దిగెను. దిగి యిప్పటి కింకను సూర్యుఁడస్తమింప కుండుటచే నెందైన మఱుఁగున నుండుట బాగని తీరమందున్న వనంబుల నడుమ సంచారము చేయుచుండెను. ఇట్లు నూఱామడ నొక్కపెట్టునఁ దరించియు హనుమంతుఁడు గాసియను నది యెట్టిదో యెఱుఁగడు. నిట్టూర్పైన విడిచిన వాఁడుకాఁడు. ఇట్లు సంచరించుచు మిగుల నెత్తైన కొండ శిఖరంబుననుండి యాకసమున వ్రేలాడు చున్నదో లేక గగనంబున కెగురుచున్నదో యన్నట్టులై యెట్టి వారికినిబోవుటకు సాధ్యముగాక దుర్గమమై



**హనుమంతుఁడు లంకనుజూచుట**

లోఁతగు నగడ్తలచేఁ జుట్టఁబడి త్రవ్వని కందకంబనఁగ సముద్ర మొప్పుచుండుటను, సీతను హరించిన కారణముగ రావణుఁ డెక్కువ రక్షయినుపన నేకాయుధపాణులై కోటగోడలు బురుజులు గవఁకులు కాచు రాక్షసవీరులను జూచి హనుమంతుఁడు తనలోఁ దానిట్లు తలంచెను.

లంక యన నేమోయని తలఁచి యుంటిని. ఈలంకయేమి! సాధ్యపడుట యేమి మొదట సముద్రము దాఁటుటే దుష్కరము. దాఁటినను యంత్రపూరితములైన యగడ్తలు దుస్తరములు. అవి దాఁటినను ఆకాశంబు ననుండు లంకఁజేరుటెట్లు? అసహాయశూరులైన రాక్షసుల జయించుటెట్లు? రావణ బలపరాక్రమములు సామాన్యములా? కపులంద తేవిధముగ లంకకు రాఁగలరు? వచ్చి వారేమి చేయఁగలరు? వారి కిది దుర్జయమే యని తోఁచెడిని. కపులుగారు గదా రాముఁడే వచ్చెనుబోత. ఆయనమాత్రమేమి చేయఁగలడు? ఆహా

ఎంతదుస్సాధము ! కవులందును నీలుఁడు అంగదుడు సుగ్రీవుఁడు ఈముువ్వురు తప్ప మఱెవ్వ రీ సముద్రమును దాఁటలేరు. ఈముువ్వురవలన నే కార్యము కాఁగలదు. పోనీ వీరి నుపాయముచే సాధింత మనిన నే యుపాయము పనికిరాదు. మంచిమాటలకా యవకాశమే లేదు. ధన మిత్త మనిన వీరు మహాధనవం తులు. వారిలో వారికి భేదము కల్పింత మనిన వ్యర్థ ప్రయత్నము. యుద్ధములో గెలుచుటకా సాధ్యులుగారు. ఎట్టు లీ లంక సాధింపవచ్చునని శిఖరాగ్రముననుండి యాలోచించి యాలోచించి లంకను సాధించువిచార మిప్పుడేల? జానకి యిందున్నదో లేదో తెలిసికొనుటకదా ప్రథమకర్తవ్యము. ఇందామెయుండెనేని సాధించు మార్గము పదపడి యాలోచింపవచ్చును. ఇప్పుడీ భీమరూపముతో నేనుండరాదు. రాక్షసులు చూతురు. అని దురాసదంబయిన లంకను జూచుచు నిరాశుఁడగుచు నిట్టూర్పు విడుచుచు నెట్టుల రావణాసురుని వంచింతునో యెట్లు సీతాదేవిని చూతునో యెట్లు రాముని కార్యము సఫలమగునో యెట్లు నేను సముద్రము దాఁటుట వ్యర్థము గాకుండునో,

కం. ఐనట్టు తోఁచుపనులేన్
భానునిఁ గనుఁగొన్న తమము పగిదిం జెడెడున్
వానిని దేశము గాలము
జ్ఞానము లేనట్టిదూత సలుపఁ గడఁగినన్.

కం. దీని నిటు సలుప సఫలం
బౌనని ప్రాజ్ఞులు విధించినట్టిది కార్యం
బైనను జెఱుచును బండిత
మాని మయినదూత శక్తిమంతుఁడు గామిన్.

కాబట్టి బుద్ధిచాతుర్యము పాయకుండు నట్లెట్లువర్తింతునో వీరు నన్నుఁ జూచిరా రామునికార్యము చెడుటే నిజము. వీరికిఁ గానరాకుండ లంకలోనికిఁ బోదమా యనిన నీరాక్షసులకుఁ దెలియకుండునట్లు గాలియు మెదలలేకున్నది రాక్షస రూపముధరించి నేనొక రాక్షసునివలె సంచరింతునా వీరప్పుడే గుర్తింతురు. అంతియుగాక వంచనము పౌరుషహాని సూచకముగదా. కావున నట్టి యుపాయములతోఁ బనిలేదు. చీకట్లు వ్యాపింపగనే గుజ్జురూపముఁదాల్చి లంకఁజొచ్చి సీతను వెదకెదను. అని నిశ్చయించుకొని యెప్పుడెప్పుడు సూర్యుఁడస్తమించునా యని కాచికొని యుండి ప్రదోషకాలంబున పిల్లియంతరూపము ధరించి యిట్లాలో చించెను. శత్రువులపురము గవకులఁజోరరాదు. అదియునుగాక యందు భటులుందురు. కావున త్రోవగానిత్రో వఁ బోయెద నని ప్రాకారము మీఁదికి నొకగంతువైచి నిలిచి లంకనంతయుఁ బాఱఁ జూచెను.

నలుచదరంబులైన బాటలతోడను, ప్రాసాదమాలికలతోడను, బంగారు స్తంభములతోను, పైఁడికి టికీలతోడను, ప్రకాశించుచు నేడెనిమిది మేడలుగలగి గంధర్వనగరంబుతో సాటియగుచు చిత్రతోరణములతోఁ బ్రకాశించు లంకను నందుఁ గావున్న రాక్షస సమూహంబులను జూచి యాశ్చర్యపడి హనుమంతుఁడు తనలోఁ దా నిట్టు లాలోచించెను.

ఆహా యేమి యీ నగరము సొంపుపెంపు. దేవనగరమైన నిట్లుండునో యుండదో దీనిని వానరులు జయింపఁగలరా? సామాన్యుల కిది దుర్జయమే. అంగద సుగ్రీవమైందద్వివిద సుషేణఋక్షులును గుముదకు శపర్వులును గేతుమాలుఁడును రాఁగలుగుదురు. అంతియగాక శ్రీరామలక్ష్మణుల యస్త్రబలమును శౌర్య ధైర్య సాహసంబులు దలంచిన నిది యొక విధమున సాధ్య మనియే తోఁచుచున్నది. అయిన నింకను లంకను జొచ్చి చూచెదఁగాక యని ప్రాకారము దిగి లోపలి కిఁబోవు హనుమంతుని లంకాధిదేవత యగు లంకయను రాక్షసి హనుమంతున కెదురై నిలిచి గర్జించి యోరి మర్కటమా ! నీవెవ్వడవు ? ఎందుఁ బోయె దవు? ఏమి పని నిలిచి నిజము చెప్పుము. లేకున్నఁ జచ్చెదవనిన హనుమంతుఁ డిట్లనియె.

వికారముఖమును, భీకరాకారమునుగల విరూపలోచనా ! నీవెవ్వతెవు? ఏలయిట్లు ఱొప్పుచు నన్నడ్డ గించెదవు? నగరమనియుండినఁ జూచుట కెందఱో వత్తురుపోదురు. నేవేల యాక్షేపించెద వనిననది యిట్లనియె.

ఓరీ ! నేనే లంకను. రావణాజ్ఞప్రకారము నేనీపురమును సర్వదా రక్షించుచుందును. నాకుఁగానరాకుండ నీపురంబునఁ జొచ్చుటకు నీగకైన సాధ్యము గాదు. ఇఁక నీ వెట్లు పోఁగలవు? నిలుమనిన హనుమంతుఁడు దానిమాటలు విని కొండవలెఁ గదలక నిలఁబడి యానగరము మిక్కిలి రమణీయముగ నున్నదని విని

యిందలి గోపురప్రాకారగృహంగణా రామంబులనెల్లఁ జూచిపోవచ్చితిని. పోనిమ్మనిన నది హుంకరించుచు నిట్లనియె.

ఓరి ? నన్ను గెలువక నీ వెట్టు నీ పురిలోనికిఁ బోగలవు. బుద్ధిలేనివాఁడా ! వెనుకకుఁ బోయెదవా చంపుదునా నా చేతి దెబ్బచూచెదవా యని యేమియుఁ గదలక మెదలక యదరక బెదరక నిలిచి నేనీపురమును



జూచికాని పోనని పలుకు నతనిని లంకయరచేతఁగొట్టెను. ఆదెబ్బకు బొబ్బరించి హనుమ నిబ్బరంబు వహించి మిసిమింతుఁడుగాక యాఁడుదాని నెట్లు చంపుదునని దయవహించి రోషము వహింపక యెడమ ముష్టి నొకపోటు పొడిచెను. ఆపిడికిటి పోటునకే యది దద్దటిల్లి గ్రద్దిన నోరు తెఱచి దబాలున వెల్లకిలఁబడి గతగర్వయై యాయనతో నిట్లనియె. వానరేంద్రా ! శరణుశరణు రక్షింపుము. రక్షింపుము. బలశాలులగు వారు బలహీనులనే చంపరన నింక నబలల వధింపరని చెప్పనేల? నేను స్త్రీని కావున నా యపరాధంబు సహించి రక్షింపుము. నేనే లంకను నన్ను నీవు భుజబలంబున నాలంబున గెల్చితివి. నన్ను బ్రహ్మయీగ్రామాధి దేవతగ నియమించిన వాఁడు వానరుఁ డెప్పుడు నిన్ను గెలుచునో నాఁడు మొదలు రాక్షసులనకు వినాశమనియు లంకకుఁ జేటనియు నెఱుంగుమని చెప్పెను. ఆప్రకారమిప్పుడు తటస్థించె నామాట సత్యము. బ్రహ్మవాక్యము సత్యము. నేఁటినుండి నిశాచరులకు వినాశకాలము. సీతాకారణంబున రావణునకుఁజేటు మూఁడును. ఇఁక నీ యిష్టము చొప్పునఁ బోయి నగరంబుఁ జూడుము. నీ కార్యముఁ దీర్చుకొమ్మనిన హనుమయు సంతసంచి యద్వారమున నగరంబు లోనికిఁ బోయెను.

రుక్మిణి- ఇదంతయు రాక్షసులు చూడలేదా.

తండ్రి- ఎట్లు చూతురు? గ్రామదేవతగుడి యూరివెలుపలఁ గదాయుండును. గ్రామము పొలిమేర యంతయు గ్రామదేవత రక్షించుచుండును. పొలిమేరలో నడుగుపెట్టఁగానే యది కనుఁగొనెను. ఎవ్వరు దిక్కులేనిచోటుగాఁ జూచి కదా హనుమంతుఁడు ప్రవేశింప యత్నించెను.

ఇట్లు హనుమంతుఁడు రావణుని తలదన్నినట్లుగ నెడమకాలు ముందుంచి లంకఁజొచ్చి యా భాగ్యోన్నతికి మెచ్చుచు సీతను వెదక నారంభించెను.

కోటలు పేఁటలు తోఁటలు బాటలు సందులు గొందులు దొడ్లు మిద్దెలు మేడలు ఆటపట్టులు వీటి పట్టులు గదులు ముంగిళ్లు అంగళ్లు సర్వము వెదకెను. అందఱ రాక్షసుల గృహములు వెదకెను. ఎక్కడ సీత కనఁబడలేదు. రావణాసురుని యంతఃపురమంతయు వెదకెను. అందును భూపుత్రి లేదు. తుదకు రావణాసు రుని పడుకటింటికిఁ బోయి యందును వెదకెను. తొలుత రావణుని పెద్దభార్య యయిన మండోదరిని జూచి యామె సౌందర్యాతిశయముచే నామె సీతయే యని భ్రమించి సంతోషించి యెగిరి తోఁకగొటికి గంతులు పెట్టి కంటిని సీతనని పొంగెను గాని తరువాత నాలోచించి ఛీ యెటువంటి బుద్ధిహీనుఁడను! ఎంతటి పాపాత్ముఁడను! శ్రీరామునివిడిచి సీతాదేవి సొమ్ములు ధరించునా? సొగసు లాశించునా? సుఖములు

గోరునా? తుదకు నిద్దురయైనఁ బోవునా? ఈమె యెవ్వతెయో యని వెదకఁగా నచ్చటి స్త్రీలొడలెఱుంగక నిద్రపోవుటచేఁ జీరలు తొలఁగినవారును పైఁటలుజాఱినవారును నగువారి నెల్లఁజూచి యయ్యోస్త్రీల యవయవములను జూచి పాపకార్యముఁ జేసితిని గదా యని పరితాపపడి వెండియుఁ దనలో నిట్లనుకొనెను. పాపమునకుఁ బుణ్యమునకు మనస్సు ప్రధానము. మనస్సులగ్నముగాక యెట్టిదియుఁ పరుండియుండఁ జూచితిని గాని నా మనస్సువీరియందు లగ్నమైనది గాదు కావున నాకుఁ బాపమెట్లుకలుగును? అదియును గాక యాఁడుజింకను జింకలమందయందుఁ గాక మఱి యెక్కడ వెదకనగును? అట్లు సీతను స్త్రీలయందుఁ గాక మఱి యెందు వెదకుదు నని నిశ్చయించుకొని లంకయందు సర్వము వెదకెను. ఆయన త్రొక్కని ప్రదేశము పదంగుళములు గలది యీ నగరమందెందునులేదు. ఇట్లు వెదకి వెదకి యెందును సీతను గానక విచార మగ్నుఁడై ప్రాకారగోడమీఁది కెగసి కూర్చుండి యిట్టు లాలోచించెను.

### -హనుమ ప్రాకారముఁ జేరి సీతాదేవి గానరామికి వ్యసనపడుట-

రాత్రి పురమెల్ల వెదకితిని. వంకలు డొంకలు చెఱువులు గుంటలు వాఁగులు బావులు కొలఁకులుగూడ సర్వము వెదకి చూచితిని. ఎందును సీత గానరాదు. సంపాతి లంక యందు సీతయున్నదని చెప్పెనే ఆమె యేమైయుండును. రావణాసురునకు వశపడియుండునా? ఛీ యిటువంటి యాగడముకూడ నుండునా? ఆమె యెన్నఁటికి పరునకు వశపడదు. అట్లైన నేమైయుండును? రావణాసురుఁ డెత్తికొనివచ్చునపుడు మార్గమధ్యములో సముద్రములోఁ బడి మరణించెనో లేక యావేగమునకు సహింపలేక ప్రాణములే విడిచెనో లేక వియోగ దుఃఖము సంహింపలేక

కం. రాముని రాకావేళా
సోముని నిరసించుముఖము సురచిర కంజా
తామలదళ నయనములను
వేమరు స్మరియించుకొనుచు విడిచెనొ మేనిఁ

సీ. చుట్టపక్కములు లేనట్టి సాధ్వి సుశీల
సీత రావణుఁడు భక్షించె నేమొ
యీసున రావణునిల్లాండ్రు రనఘాత్మ
బట్టి భక్షించిరో పాపరతలు
హా రామ ! హా లక్ష్మణా ! హా యయోధ్య ! య
టంచు నేడ్చుచు మరణించె నొక్కొ
పంజరంబున గోరువంక నానసురుండు
నేలమళిగనుంచి యేలునేమొ

ఆ. జనకరాజతనయ సాధ్వి సుమధ్యను
రాముపత్ని సీత రావణాసు
రాధిపతికి నెట్లు స్వాధీనయయ్యెడు ?
నట్టి దెన్నఁడైన నగుటగలదె.

అయ్యో ! సీత యనిన రామునకుఁ బ్రాణముగదా. అట్టి సీత లేదని రామునకు నే నేమని చెప్పుదును.
సీతాదేవి లేదని చెప్పినఁ గలుగు ననర్థంబుల హనుమంతుఁ డాలోచించుట.

సీత లేదని రామునితోఁ జెప్పినను జెప్పకున్నను ననర్థకము తప్పదు. కావునఁ జెప్పుదునా చెప్పకుందునా ? ఇట్టి విషమ సమయంబుల బుద్ధిమంతుఁడగు వానికి గర్తవ్యమెద్ది?

నేనూరకపోయి సీత కానరాలేదని చెప్పిన వానరులందఱు నన్నేమందురు. అన్ని ప్రగల్భములు పలికి వచ్చితిని గదా. అంతయు వ్యర్థమయ్యెను. పూనిన కార్యమునందలి కష్టసుఖము లెఱుంగక యహంకారంబున ముందుగనే ప్రగల్భవాక్యములు కొండంతయాశతో నెప్పు డరుదెంతునా శుభవాక్యము వినిపింతునా యని యొంటికాల నిలఁబడియున్నారు. అట్టివారి యెదుటికి నే నేమని పోదును? పోయితినిబో సీతలేదని యేమని చెప్పుదును. లేనిపదార్థము నెక్కడనుండి తెచ్చునని వారందఱు క్షమించిరనకో ఈవార్త యిష్ట భార్యుఁడైన రామునకేమని చెప్పుదును? ఆయనకు భార్యయనిన ప్రాణమే. అట్టి భార్య లేదనిన నాయన యేమగునో సోమరులమై వంచించితి మని కోపించునో లేక శోకమున మరణించునో, కొపించెనా సుగ్రీవాది సహితంబుగ

సకలవానరుల నిమిషంబున నిర్దహించి లోకము నవానరము నరాక్షసము నొనర్చును. లేక మరణించెనా వెంటనే లక్ష్మణుఁడు మరణించును. వీరి యిరువురి మరణము విని సౌభ్రాత్రనిధియగు భరతుఁడు నశించును. మువ్వు రన్నలు మరణింపఁగా శత్రుఘ్నుఁడు మరణించును. కొడుకులందఱు మరణింపఁగా గౌసల్యా సుమిత్రాకైకేయులు మరణింతురు. వారితోడ నంతఃపురముల వారందఱు మరణింతురు. అటువంటి ప్రభువు లందఱు మరణించిన మనము జీవించి యేమని ప్రజలు మరణింతురు. ఈ గోరముఁజూచి కృతజ్ఞుడైన సుగ్రీవుఁడు మరణించును. వాలి మృతికి వగచు తార ఆయన వెంట చచ్చును. వారితో నంగదుఁడు గూలి పోవును. వెంటనే రుమయు మరణించును. ఈవిధముగాఁ గిష్కింధ యంతయుఁ బాడగును. వానరులందఱు తమ తమ బంధువులు మరణించుటచేఁ దామును జీవింపనొల్లకకొండలెక్కి దూఁకియో అగ్నిలోఁ జొచ్చియో నీళ్ళలో దుమికియో కత్తులపైఁ బడియో యేవిధముగనో నిశ్శేషముగ నశింతురు. అంతటి యనర్థకమునకు నుభయరాజ్యనాశమునకు నేనే కదా మూల మగుదును. ఇప్పుడు కిష్కింధకుఁబోయితినా హాహా యను నేడ్పు రవము తప్ప మఱియేమియు వినఁబడదు. కాఁబట్టి నేను గిష్కింధకుఁ బోకుండటే క్షేమము. అటులైన రామలక్ష్మణ సుగ్రీవులు కొన్ని దినములైన నాశతోఁ బ్రాణములతో నుందురు. ఎన్నాళ్ళని యిచ్చట దొంగవలెఁ జరించుచుందును ? సీతనుఁ జూడకపోయితినా యిఁక జీవించి యేమి ప్రయోజనము? దేహము విడుచుటే శుభము. ఆత్మహత్య కూడదందురే. ఎట్లు చేయుదును? నేనై మరణింను. చెట్టుక్రిందఁ గూర్చుండెదను. చేతిలోఁ గాని నోటఁగాని ఫలము పడెనా తినుదును. పడకుండెనా యూరకుందును. అటుగాక పోయెనా మునినై కాలుసేయార్పక లింగిని వ్రతము సాధింతును. కాకులు గ్రద్దలు నాదేహమును దినిపోనీ. అవును ఏదోవిధముగ మరణింతుననుకో. ఏమి లాభము. ఎవరికి మేలుచేసినట్లు? భూమిమీఁద బుట్టినది తేరకుఁబేరు పెంపు లేక యెంతటి పిచ్చి యాలోచన?

ఆ. ప్రాణములను విడువ బహుదోషములు గల్గు
బ్రదికియున్నఁ గాదె పడయు శుభముఁ ?
గానఁ దాల్చువాఁడ మేనఁ బ్రాణంబులు
బ్రదికియున్న భద్ర మొదవు నిజము.

అవును బ్రతికియుండి నేను జేయవలసిన కార్యమెయ్యది? తరువాత యటుండనీ. రావణునిఁబట్టి త్రుంతునా? లంకను? సముద్రములో ముంతునా? లేక రావణుని యజ్ఞపశువువలెఁ దోకఁతోఁజుట్టి రామునొద్ద కీడ్చుకొని పోవుదునా? ప్రయోజనము? సంపాతి సీత లంకలోనున్నదని చూచినట్టు చెప్పెనే ఆయన మాట లునమ్మికదా వచ్చితిని. ఇంతలో సీత యెక్కడఁ బోవును? మరల వెదకుదునా? అయ్యో యీ యాలోచనలతోనే రాత్రి పోవుచున్నదే. అని యాలోచించి యాలోచించి నలువైపులు పాఱఁజూడ రావణు నంతఃపురగృహంబున కుఁ జేరిన యొక యశోవనము కనఁబడెను. దానిని జూచి యోహో దీనిని నేనింతవఱకుఁ జూడలేదే. సీత యిందున్నదేమో వెదకెదఁగాక. దీనిని జూడగానే నామనస్సున నొక యానందముకలుగుచున్నది. ఇదిశుభ సూచకము. ఇందు సీత యుండును. సీత యుండెనా రక్కసుల కండకావర మెల్లఁగ్రక్కించెదనని యుత్సాహి యై వసురుద్రాదిత్యులకును మరుత్తులకు నశ్విలకు సమస్కరించిలేచి.

ఉ. మ్రొక్కెద రామచంద్రునకు మోడ్చెదఁగేలు సుమిత్రపట్టికిన్
మ్రొక్కెదఁ దద్విదేహప తనూజకు శ్రీరఘురాముదేవికిన్
మ్రొక్కెద ధర్మవాసవ మరుద్గణ మారుత రుద్రపాలికిన్
మ్రొక్కెద సూర్యచంద్రులకు మ్రొక్కెదఁ దామరసాప్తు సూతికిన్.

అని పునఃప్రణామంబులు గావించి దిశలన్నియుఁ గలయజూచి యశోకవనంబుపై దనదృష్టి నిలిపి పరికించి యిట్లని యాలోచించెను. ఈవనమును బెక్కురు భీమాయుధులై రాక్షసులు కావలికాచుచున్నారు. మారు తుండును మెల్లగ వీచుచున్నాడు. ఇందేదియో విశేషము లేకుండిన నీవనమాత్రము నిందఱు కాచుచుండనేల? కావున నిందు సీతయున్నదని నిశ్చయించెద. సంపాతియు రావణు నంతఃపురంబున సీతయున్నదని నిశ్చ యించెద. ఇది యంతఃపురోద్యానమే కదా?

చం. మనులును వేల్పులున్ దివిజముఖ్యుఁడు వజ్రిస్వభుండు బ్రహ్మవా
య్వనిల శశి ప్రభాకర జలాదిపశర్వమరుత్తు లశ్విలున్
గనులకుఁ దోఁచువారు మఱి కాననివారును సర్వభూతముల్

ఘనతర భూతనాయకుండు గార్యము సిద్ధియొనర్తు రియ్యేడన్.

అని నమస్కరించి యయ్యో దుష్టుండగు రావణుచే నపహరింపంబడి వెతలుపడు నా పరమపతివ్రత ముఖచంద్రునెప్పుడు దర్శింతునో,ఎప్పుడు నేను గృతార్థుండ నగుదునో యనుకొనుచుం జిన్నరూపున మెల్లగ నాకాకు కదలకుండునట్లు అశోకవనంబునం జొచ్చి యచ్చటి వినోదంబుల నెల్ల చూచి యచ్చెరుపడుచు నావనమంతయుం దిరిగి సీతాదేవిని వెదక నారంభించెను.ఇట్లు వెదకుచుం బోవంబోవ నొకచో మిన్నంటుచుం గన్నులకు మిఱుమిట్లు కొలుపుచు కైలాసమువలెం దెల్లనై పగడముల మెట్లు బంగారు టరుంగులును,గలిగిన వేయి స్తంభముల మేడయొకటి గానవచ్చెను.దాని సమీపంబున మాసిన యొంటిచీరెయుం బెసంగొన్నయొంటి జడయు,ఆహారములేక చిక్కిన దేహమును,నిట్టూర్పులును,గుర్తింపరాని యాకారమును,గలిగి పొగకప్పిన జ్వాలయో యనందేజుమాసి,క్రొన్నెల వోలె విశేషకాంతి లేకయు మనోయజ్ఞమై,యిది సహజస్వరూపమగునా యనిసందేహము కలిగించుచు దుమ్ముకప్పిన మేనితో తామరలేని కొలనివలెనైం యంగారక గ్రహపీడతయైన రోహిణివలె నుండునొక తపస్విని,జూచెను.

సీ. కాలువలైపాఱు కన్నీరు మొగమెల్ల
నావరింపంగం గడునడలు దానిం
దలపోతలకుం జిక్కి తతశోకమున స్రుక్కి
యెప్పుడు వెకివెక్కి యేడ్చుదానిం
దనవారి మొగములు గనలేక రక్కసి
పిండు మోములంజూచి బెగడుదాని
వేంటకుక్కలలోన వేర్పడి చిక్కిన
యాండజింకనంగ నల్లాడుదాని

తే. నల్లత్రాచన దిగి జఘనంబు నొరయు
నొంటిజడతో శరత్తున లుదయవేళం
గారుటడవుల నొప్పారు క్ష్మాతలంబుం
బోని దానిని నెఱమాపు మేనిదాని.

శోకార్ణగాకయు శోకించుదానిని ధ్యానిరతయై యుండు దానిని నొక తరుణిని జూచి హనుమంతుం డిట్లాలోచించెను.

ఈకృశించిన మలినాంగి సీతాదేవిగా నుండునా?నాండు మింటంబోవునపుడు మేమందఱము సీతను జూచితిమి కదా.ఆమె యిట్లు లేదే.రావణుం డాహారకమిడక చంపుచున్నాండా యేమి?వాండు దుష్టభావముతోం దెచ్చెను గనుక నాహారమియ్యక మానండుగాని రామునిభార్య పరమ పతివ్రత యా నీచుని పదార్థము వ్రేలు వేసి యుంటునా? ఆ కారణముచే నిట్టు గుర్తింపురాకున్నది.శరీరము కృసించినది కాని నాకు జ్ఞప్తియుందున్నం వఱకు నామెయందున్న మొక్కట్లీమెయందు నున్నవి.అంతియుకాదు.శ్రీరాముండు సీతాదేవిమేన నేయే యాభరణములున్నట్లు పలికెనో యవియన్నియు నీమెకు సమీపమందే చెట్టుకొమ్మలం గానవచ్చుచున్నవి.వీనిని జూచియైనం దన్ను గుర్తింతురుగాక యని యీామె యిట్లు కట్టిపెట్టెను గాని లేకున్ననిట్లు చెట్లకు సొమ్ముల నెవరైనం బెట్టుదురా? చక్కని చేంతకమ్మలు,బోగడలు,రత్నములు,పగడములు,చెక్కిన కంకణములు,కడియ ములు,గొలుసులును,మక్కి నల్లపాఱి చాలదినములు మేనధరించిన వానివలెం గానవచ్చుచున్నవి.జతగాను ండు సొమ్ములలో నొకటి యా మూటయందును మఱియొకటి యిందును గానవచ్చుచున్నవి.అక్కడనుండు నవి యిక్కడలేవు.ఇక్కడ నుండునవి యక్కడ లేవు.అంతియుగాక యీామె కట్టుకొన్నచీరె మాసి నలిగి రంగుమాఱి నట్టున్నను అక్కడనుండునట్టి చీరతునుకను నేంతయందును చాయయందును అంచునందును అన్నివిధముల సరిగానున్నది.మఱియు సరిగపైంట కొంగున నీమె యాభరణములు ముడిచి కదా వైచెను.ఈమె కట్టిన చీరకు ఆకొంగు కొఱంతగానున్నది.అట్లుండుటకు మఱే కారణమున్నది? ఈవ్రేలాడునగలు మఱియె వ్వరివో యనుకొందునా యీ నగలన్ని నీమెధరించినట్లీమె దేహంబున గుర్తులున్నవి.అంతియగాదు.రాముని లక్షణములను బట్టి చూడ నతనిభార్య కెట్టి లక్షణము లుండవలయునో యవియన్నియు నీమెయం దున్నవి.ఈ మెకు సరిపోవు లక్షణములు రాముని యందున్నవి ఇట్లుండుట యుక్తమేకదా.అని యాలోచించి యాలోచించి

సీ. ఆపదవేళల నంగన నొకర్తు

బ్రోవలేదనెడి కారుణ్యమునను
నన్ను నమ్మినదాని కిన్నిపా ట్లబ్బిన
సైcచితి నను నానృశంస్యమునను
అర్ధాంగలక్ష్మిని నకట కోల్పడితిcగా
సుందరి నని యెడి శోకమునను
ఒద్దలేదాయెcగా యెప్పులకుప్ప నా
ప్రియ యన్న వెరవేcకి వేcకరమున
తే. నకట యీ నాలుగింటను నడలుచుండు
రామచంద్రుcడు హృదయ మీరామయందు
నిలిపె నీమెయుc బతియంద నిలిపె మనముc

ఆహా రాముcడెంతటి యసాధ్యకార్యమును జేసెను. ఈమెను చూడకయు ప్రాణములను మేనిలో నిలిపియున్నాcడు గదా. అంతేకాదు చింతకుcగూడc బాల్పడcడుగదా. ఓహోహో ఏమి నిబ్బరము ! ఏమి నిబ్బరము !

ఆహా రామా! జితేంద్రియుcడవనిన నీవేసరి. ఏమి నీధైర్యము ! ఋష్యమూకమునందు భార్యను దలcచి శ్రీరాముcడేడువcగా అయ్యో రాముcడెంత పామరుcడు. స్త్రీ నిమిత్త మిట్టు లేడ్చుచున్నాcడు. ఎంత నిబ్బరము లేనివాcడు. ఎంతగుండెదిటము లేనివాcడు. ఎంతటి కాముకుcడు. ఎంతటి యింద్రియ దాసుcడు అని మతిలేనివాcడనై యోగ్యత యెఱుcగక తలంచు చుంటిని గాని అబ్బా! ఆయన యెక్కడిరాముడు! అని రాముని బొగడిపొగడి సీతవంకcజూచి కన్నులc బొంగి పొరలివచ్చు నీటిని నిలువcజాలకయునయ్యయ్యో! తల్లీ! యెంతకష్టము ! యెంత కష్టము. నీకు రావలసిన కష్టమా యిది యని యిట్లు తలపోయిచుcదనలోc దానేడ్చెను.

కట్టా! గురుభక్తుcడగు లక్ష్మణు గురువరుని ప్రియురాలు, భూపుత్రి,పతివ్రత యగు సీతయును దుఃఖించినచో నిcక నెట్టి వారికిని గాలము దాcటరానిదే.

కం. రాముని కీయసితేక్షణ
రాముcడు నీసతికిc దగును బ్రాయమునందున్
శ్రీమానిత శీలంబున
సాముద్రిక లక్షణముల సద్వంశమునన్.

అని ముల్లోకములకు వేల్పుసానియయిన లక్ష్మివలె నుండు సీతాదేవిని జూచుచు మరల రామునిc దలcచి

సీ. ఈ కాంతకై కదా యిఘువున నొక్కంట
బలశాలి యవ్వాలి భంగపడియె
ఈవెలందికె రావణతుల్య వీ
ర్యుండు కబంధుండు రూపుమాసె
ఈమానినికె కదా భీమవిక్రముc డైన
యనిరోధుcడు విరాధుc డంత మొంది
నీ నెలంతకె కదా కానలోc బదునాల్గు
వేలరక్కసులకుc బేరుమాసె
తే. నీమెకై కాదె ఖరఖలునామ మడcగె
నీసతికిcగాదె త్రిశిరుండు నీల్గినియె
నీసుదతికయి దూషణం దేపడంగెc
బటుపరాక్రమముc దగు రామభద్రుచేత.

ఈమె కారణమునc గదా వాలి పాలితమై యన్యులకు దుర్లభమైన కపిరాజ్యమంతయు నిమిషములో సుగ్రీవునకు లభించెను.

ఈమెకై కదా శతయోజన విస్తీర్ణమైన సముద్రమును నేనుదాటి యీపట్టణమును గంటిని. ఈమెకై

యీ కార్యములు చేయుట లెక్కలోనిదిగాదు. రాముఁ డీమెకై మూఁడు లోకములు భస్మీభూతము చేసినను నకార్యము గాదు.

కం. మేలో త్రిభువనరాజ్యము
మేలో జానకి యటన్న మేదిని సుతకున్
ద్రైలోక్యరాజ్య మెల్లను
జాలదుపో యొక్కకళకు సరిపోలంగన్.

వాస్తవముగ నీమె ధర్మశీలుఁడను మహాత్ముఁడును మిధిల నాథుండునునై కీర్తిగన్న జనకుని తనయ రామునిభార్య పరమపతివ్రత సీతయగును. ఇందు సందేహము లేదు.

ఉ. చుట్టములందొఱంగినను, జాఋలువోయినఁ గానుభోగముల్
నిట్టలమైన కష్టముల నెవ్వగఁ దాను మునింగియుండినన్
నెట్టిన ప్రాణనాథుఁ గన నిల్పి మనం బనయంబు నోర్పుతో.
గిట్టకయున్నదీమె పిడికింట నయో బిగఁబట్టి ప్రాణముల్.

ఉ. చూడదు రాక్షసాంగనలఁ, జూడదు పుష్పఫలద్రుమంబులన్
జూడదు రమ్యహర్మ్యముల సుందరి డెందమునందు నెప్పుడున్.
జూడఁగఁ గోరుచున్ భువనసుందరు రాముని నొక్కనిన్ మదిన్
వేడుకసేయ దెయ్య దవనీసుత; యుక్తమెకా తలంపఁగన్.

కం. పరభూషణముల కంటెను
బరమంబగు భూషణంబు భర్తయె సతికిన్
దురుణీమణీ తద్భూషా

అయ్యో ! తుమ్మెదఱెక్కలువోలె నీలంబులైన ముంగురులును దామర ఱేకులతో సమంబులగు నయనంబులునుగల సుఖోచిత నీమెనుగన నాకుఁగూడ దుఃఖము పట్టరాకున్నది. శ్రీరామలక్ష్మణులు కాచుచుండ నిర్భయం బున వర్తించు నీతలోదరి వికార రూపలగు రాక్షసస్త్రీలు గాచుచుండనంతంబులేని చింత నలఁగుచున్నది. దైవమున కేది యసాధ్యము ? అని పెక్కు విధముల నాలోచించుచు సీతం జూడఁగలి గితి. ఇది మదీయ భాగ్యంబె కదా యని రామలక్ష్మణులఁ దలఁచి వారికి రెండు కేలుమోడ్చి నమస్కరించి యిఁకఁజేయఁదగినకార్యం బెయ్యది యనియోజించుచు హనుమకొమ్మలసందున మణఁగియుండె.

అంత రావణుం డంతఃపురపరివారముతో నచ్చోలికి వచ్చి సీతను దుర్భాషలాడుటయు నా పతివ్రత యద్దురాత్ముని నిందించుటయు వాఁడును జేయునది లేక బెదరులు వదరుచుఁ బోవుటయు సీతాచరిత్రం బునఁ జెప్పితిని గదా. అట్లు వాఁడు వెడలిపోయిన పదపడి హనుమంతుఁడు రాక్షసస్త్రీలు దూరంబునఁబడి నిద్రించుటయు, సీతనొంటి దుఃఖించుటయుఁ జూచి యెట్టులీమెను బల్కరింతునని యాలోచించెను. నానా వానరులే మానినీమణిని వెకుచున్నారో యట్టి యలినీలవేణిని నేనిందుఁగనుఁగొని కృతార్థుఁడనైతి. చారుఁడనై లంకయంతయు సంచరించి పురంబు తెలంగెఱింగితిని. రావణుని గూడఁ గని వానిబలంబు తెలంగు నూహించుకొంటిని. ఇఁక నేను జేయవలసినకార్యమేమున్నది. మరలి పోయి యీవార్తవానరులకు రామునకు నెఱిఁగింతునా? లంకలో సీతయున్నది రా రండని వానరులను రామలక్ష్మణులను బిలిచికొని వచ్చితిననుకో. ఈ రాక్షసులవలన బాధ పడఁజాలక యీబాలిక యురిపోఁతలఁబ్రాణంబు విడువఁగడఁగియున్నది. ఇట్టియీ మె దుఃఖాతిశయంబున మరణించిన వారంద ఱిందువచ్చి ప్రయోజనమేమి? వారు వచ్చి చూచినప్పుడు సీతలేదాయెనా నేను మోసగించితినని యసత్య మాడితినని వారంద ఱెంతురు. దానివలనఁ గలుగు ననర్థకము లే నేమని యనుకొందును. కావున నీమెను నూఱడించి నారాక యెఱిఁగించి రామ లక్ష్మణుల సేమంబు తెలిసి మరలిపోవుటయే నీతి. ఈమెతో సంభాషించి యూరడించి పోయితినా రాముని నూఱడింపఁగలను. అటు గాదేని శ్రీరాముఁడు హనుమా? సీత నాకేమని చెప్పుమనెనయ్యా యని యడిగిన నీమెను మాట్లాడింపకపోయి న నేనేమని ప్రత్యుత్తరమిత్తును. ఊరక చూచివచ్చితి ననిన నీవుచూచినది సీతయని యెట్లునమ్ముదును? నీకు నాయుంగరమేల యిచ్చితినని యనఁడా? కావున నెటుచూచినను నేనీమెను బలుకరించుటే శ్రేయస్కరము. ఈమెను బలుకరించునుపాయమేది ? నేనా వానరుఁడను ఈమె మానవి. నాభాషయీమెకు వచ్చునో రాదో. నేను బ్రాహ్మణునివలె సంస్కృతము మాటలాడితినా క్రోఁతియేమి! సంస్కృతము సంభాషించుటేమి! ఇది రావణ

మాయయని పలుకనే పలుకదు. అటు గాకున్న నేను మఱియొక విధముగా బలుకరించు మార్గము లేదు. మనుష్యులవలె సంస్కృతముననే సంభాషింతును. అటు సంభాషించితినా క్రోఁతిరూపమున సంస్కృతభాష యిది విపరీతమని తలంచి ముందే రాక్షసులకు బెదురుచుండు నీమె మఱింతబెదరి రావణాసురుఁడే యిట్లు వచ్చెనని యఱచును. ఆయఱపులకు నానాసాధనముల ధరించి రాక్షసస్త్రీలు నావెంటఁబడి కోపించి నన్ను వధింప యత్నింతురు లేక పట్టికట్టి రావణుకట్టెదుటికిఁ గొనిపోదురు. వారికిఁ జిక్కక కొమ్మలు రెమ్మలు గొప్పమొదళ్ళతోఁజెట్లనుబెఱికి చంకల నిఱికించుకొని పరువెత్తితినా వారు రావణుగృహరక్షకులయిన భటులను దోడితెత్తురు. అప్పుడు వారికి నాకు యుద్ధమగును. వారిని జంపితినా రావణు దండంతయు నాతోఁ బోరవచ్చును. వారిని జూచిన నాకును రోషము పెరుఁగ వారినెల్లఁ జంపవలసి వచ్చును. అందఱును జంపితినా గాసిచే మరల సముద్రము దాఁటఁగలనో లేనో. ఒకవేళ వారు నన్నుఁబైపడి పట్టికొనిన నన్ను వధింతురు. సీతను జంపుదురు. ఈవార్త యేదియు రాముని చెవిఁబడదు. ఆవిధముగ రామసుగ్రీవులు పట్టిన కార్యము పాడగును. సీతను జంపక పోయినను నేల మళిగల నెందైన దాచుదురు. అప్పు డెవ్వరేమి చేయఁ గలరు? రాక్షసులు నన్నుఁజంపినను బట్టి కట్టినను రామకార్యముఁ దీర్పఁగలవాఁడు మఱియొకఁడు లేఁడు. నూఱుయోజనముల సముద్రము దాఁటలేమని యందఱుఁ జెప్పిరి గదా? కావున నిన్ని సందేహములు గల కార్యమును బుద్ధిమంతుఁడు చేయరాదు. ఈవిధముగఁ జూచినఁ బలుకరించి నను బలుకరింపకుండిన నుఁ గీడు తప్పదు. దైవమా యెట్లు కార్యహాని గాకుండును. ఎట్లు నాబుద్ధి జడత్వము నొందకుండును. ఎట్లు నేను సముద్రము దాటుట వ్యర్థము గాకుండును. రాముకార్య మెట్లు నెఱవేఱును అని యాలోచించి యాలోచించి యిట్లు తీర్మానించుకొనెను.

తండ్రి– మీరు పండుకొను వేళయయినది. పొండు. తక్కిన చరిత్రమంతయు రేపు చెప్పెదను.

================

## రెండవ భాగము

తండ్రి– తరువాత కథవినుఁడు. హనుమంతుఁడు తనలో నిట్టు లాలోచించెను.

నారూపము గానరాకుండ దాఁచి సంస్కృతమున సీత భయపడుకుండునట్లు శ్రీరాముని స్తుతించెద ఆపొగడ్త వాక్యములు విని యాయె యేమితలంచునో యేమిచేయునో చూచి తరువాత కార్యమాలోచించెద. సంస్కృతమున మాటలాడినవే యీ రాక్షసస్త్రీలకును బోధపడకుండును. అని దశరథుండును రాజేంద్రుండు మహాధర్మాత్ముండు రథకరి తురగభట సంపన్నుడు రఘుకుల గ్రామణి యొకఁడుండెనని ప్రశంసింప మొదలు పెట్టెను. టతరువాత సీతాంజనేయుల సంభాషణము,హనుమంతుఁడు నిక్కపు రాముదూత యని సీత నమ్మట,సీతాసందేశము లోనగు వృత్తాంతము,సీతవలన హనుమంతుఁడు మరలిపోవననుజ్ఞగొనుట వఱకు మీకు సీతాచరిత్రంబునఁ జెప్పితినిగదా యావలి వృత్తాంతము వినుఁడు.

అట్లు సీతాదేవివలన నాశీర్వచన పూర్వకంబైన యాజ్ఞగొని హనుమంతుఁ డాప్రదేశము విడిచి యావలఁ బోవుచుఁ దనలోఁ దానిట్టు లాలోచించెను సీతాదేవిని జూచి రమ్మని రామసుగ్రీవులాజ్ఞాపించిరి. వారు చెప్పినట్లు సీతాదేవిని జూచితిని. ఈవార్త యారామునకుఁజెప్పిన నాయన నన్నేమి ప్రశ్నించునో. హనుమా! లంకయంతయుఁ జూచితివి. సామ మార్గమున రావణుఁడు సీత నిచ్చునా?లేక దానభేదములకు సాధ్యుఁడా? అటుగాక దండమే ప్రయోగింపవలయునేని వాని బలమెంత ?లంక సాధ్యమా? యసాధ్యమా? రాక్షసులు సాధ్యులా? యసాధ్యులా? యుద్ధమున మనబలమునకు రావణు బలమునకుఁ దారతమ్యమేమి?యని రాముఁ డడుగుట స్వభావమేకదా? నే నేమియుఁ జక్కఁగ శోధింపకపోయి యీప్రశ్నలకు నేమి ప్రత్యుత్తర మిత్తును. ఎదిరిబలాబలములు తెలిసినఁగదా రాముఁడు దానికిఁ దగుయత్నమును జేయును. నాకుఁ జూడ నీ రాక్షసుల యందు సామము ప్రయోగించుటవలన మేలులేదు. వారియొద్దనే వలసినంత ధనమున్నది. అంత కెక్కువ యిప్పుడు రాముఁ డేమి యీయఁగలఁడు. పరాక్రమమున నధికులగు వీరిని భేదింప సాధ్యము గాని పని. కావున వీరిని సాధించుటకును గార్యము చక్కఁబఱుచుటకును దండ మొక్కటే గతి. దండము ప్రయోగింప వీరి బలాబలములు తెలియవలయును. అవి మన కిక్కడఁ జెప్పువాడెవరు?రహస్యముగఁ దెలిసికొనుటకు నెన్నిదినములని నేనిందుందును?కావున యుద్ధమొనర్చియే వీరి బలాబలములులోఁతుపాఁతు తెలియవలయును. ఆ నిమిత్తముగఁ దొలుతఁ గొందఱఁ జంప వలయును. హతశేషులు పోయి చెప్పిన

మఱికొందఱు వత్తురు.వారిని జంపిన మఱి కొందఱు వత్తురు.ఈవిధముగఁ జంప మొదలు పెట్టితినా తుదకు రావణుఁడే రణమునకు రావలసి వచ్చును.అప్పుడు వానితో యుద్ధముచేసి మాయిరువురు బలముల తారతమ్యముకనుఁగొని చెక్కుచెమర్పక రామునొద్దకుఁ బోయెదను.అటైన గొంత శత్రుసైన్యమిప్పుడే చచ్చుటచే రామునకును రణభారమును తగ్గించినవాఁడనగుదును.

అదియు మేలేకదా ఈప్రకారము చేసితినేని నేనే కృత కృత్యుఁడను.ఇది సరియేగాని శ్రీరాముఁడు సీతను జూచి రమ్మనెనుగాని యీదుర్జాతులతోఁ బోరి రమ్మనెనా? ఇది యంతయుఁ జేయుట చెప్పనిపని చేయుట కదా దానివలన నేమి యొప్పమి పుట్టునో?ఇది దూతకార్యమగునా? సత్యముగ నగును.ఏలనిన; ఒక కార్యమును జేయుమని ప్రభువు చెప్పినపుడు ఆకార్యము చెడకుండునట్లు దానికి సంబంధించిన యెన్ని కార్యములైన దూత చేయవచ్చును.కార్యహాని యగునట్లు మాత్రము చేయరాదు.

ఉ. ఎంతయుఁ జిన్నపాటి పనినేనియుఁజక్కఁగ జేయుఁ బూనుచో
సంతసమందఁ గూడదొక సాధన మబ్బిన యంత నర్థమౌఁ
జింతిలఁ బెక్కుమార్గములఁజేయఁగ దానిని గాన జానకీ
కాంతుని యిమ్మహోక్రియముఁ గార్యము చేయఁగఁ బెక్కు భంగులన్.

దీనివలన నేకార్యహాని రాఁగలదు.సీతకపాయము గలిగి ననేకదా కార్యహాని ఇఁక నామె తానుగ మరణింపదు.రావణుఁడు కామాంధుడై యున్నవాఁడు.బలమత్తుఁడు కావున సీతను వధింపఁడు.సీతాపక్ష మువారు కొంద ఱిందున్నారని యెఱిఁగితిని గదా.వాఁడు స్త్రీవధముఁ జేయంబూనిన వారూరకుందురా.అది యును గాక లంకావాక్యములు త్రిజట స్వప్నము రామున కనుకూలములుగ నున్నవి.ఇఁక నే నేల సందేహిం పవలయును.కావునఁ గలహమునకు గాలు ద్రవ్వవలసినదే.తొలుత రావణునకుఁ బ్రియమై యింద్రుని నందనము వలె నున్న యీవనము పాడుచెసెదను.ఇది కారుచిచ్చునఁ గాలినట్టు పాడుఁకాగా రావణుఁడు రాక్షసులను గొందఱ యుద్ధమునకుఁ బంపును.వారిని జంపెదను.తరువాత కార్య మావల నాలోచించెదను. అని హనుమంతుఁడు చెలరేఁగి మహావాయువు నట్టులు విజృంభించి తోఁకతోను చేతులతోను కాళ్ళతోను చెట్లను పెఱికి తన్ని పడగొట్టి విఱిచి లతలుద్రెంచి ఫలవృక్షములఁ ద్రుంచి పక్షుల నదరించి మృగముల బెద రించి కేళిపర్వతముల నుగ్గుసూచము చేసి విహారస్థలముల రూపు మాపి కొలఁకులనొడ్డులు సురలఁ ద్రోచి సీత యుండిన వృక్షంబు నొక్కటిదక్క నిమిషములోఁ బ్రమదావనం బంతయుఁ బగ్గము పాడుకావించి పోయి తోరణస్తంభంబునఁ గూర్చుండెను.

హనుమంతుఁడు తోఁకతోఁ జుట్టి విసరి వైచిన చెట్లు ఆకాశమునఁ బోవునపుడు గాలికి పూవులు రాలి మేడలమీఁద బయళ్ళలోఁ బండుకొనిన రాక్షసదంపతులపై బడ రాక్షస వీరులు గర్వంబున భార్యలఁ జూచి ప్రేయసి చూడుము నాదెబ్బకు దేవత కొంతసేపటికి పెద్దకొమ్మలు వృక్షములే పడి పండ్లురాలఁ దలలు పగుల నడుములు విఱుగ నయ్యయ్యో పూలవాన గాదు రాలవానరాదైవమా చెట్లవానరా యబ్బా యనుచు మొత్తుకొనుచు నందఱు వీథులలో గుంపులుచేరి యేమి యీవిపరీతమని యొకరిమొగము నింకొకరు చూచుచుండిరి.

ఇంతలో నశోకవనములోని రాక్షసస్త్రీలు పోయి రావణునిద్దురలేపి రాక్షసరాజా! యెవ్వడో క్రోఁతి యొకఁడు వచ్చి సీతతో నేమేమో మాటలాడి వనమంతయుఁ బాడుచేయుచున్నాఁ డనిన వాఁ డదరిపడి దీపమునుండి మంటతోడ రాలు చమురు బోట్టులవలెఁ గన్నులనుండి నీటి బిందవులు రాలఁ గోపంబున వానరుఁ బట్టి తెండని తనతో సమానబలముగల కింకరులనువారిని నునుబదివేల రాక్షసుల నంపెను.వారును ఖడ్గములు పరిఘములు ధరించి హనుమంతునిమీఁద దాడి వెడలిరి.హనుమంతుఁడును వాలమల్లార్చి భూమి గడగడలాడునట్లు నేలపైబాఁది మింటికెగసి యార్భంటించిన నాగర్జనకు భయపడి పక్షు లాకాసమున కెగిరిపోలేక గిరగిర తిరిగి నేలఁబడెను.ఆంజనేయుఁడును.

చం. జయము జయంబు రామునకు సారపరాక్రమ ధన్యమూర్తికిన్
జయము జయంబు విద్విషదసహ్యతరస్వి సుమిత్రపట్టికిన్
జయము జయంబు దాశరథి సంపరిపాలితుఁ డౌవలీముఖో
చ్చయపతి సూర్యపుత్రునకు సాహసవిక్రమకీర్తి శాలికిన్.

ఉ. దాసుఁడ సర్వసద్గుణ వితాన మనోహర రామమూర్తికిన్
గోసలదేశ వల్లభునకున్; హతశత్రుఁడ వాయుపుత్రుఁడన్

నాసరిగారు సంగరమునన్ దశకంఠులు వేవురేనియున్
వాసి యడంతుఱాల ద్రుమపాళులనే హనుమత్సమాఖ్యుఁడన్

కం. ధ్వంసంబు చేసి లంకను
హింసించి సమస్తరాక్షసేంద్రుల సీతా
హంసీయానకు మ్రొక్కి ప్ర
శంసితగతిఁ జనెద మిడుక సకలసురారుల్.

అని పెద్దయెలుంగున ఘోషించిన నిశాచరులు భయపడియు వెనుదీయక యతనిపై నా యుధములఁ గురియింపఁ బొచ్చిన నాంజనేయుండు తోరణంబునున్న పెద్ద యినుపగుదియఁ గైగొని గగనంబు కెగసి దాని గిరగిరద్రిప్పి వారిపైఁబడి వ్రేటునకు నూర్లకొలఁది చదుపుచు నిమిషంబున వారినెల్ల రూపుమాపెను. హత శేషులు పోయి కింకరులెల్ల యమకింకరుల వశమైరని రావణునకుఁ దెలుపుటయు నతఁడు మండిపడి ప్రహస్తుఁ డను మంత్రికుమారుని జంబుమాలిని హనుమంతుని మీఁదికి నంపెను.

వాయునందనుఁడు నీలో నూరకుండనేల యని మేరు పర్వత శిఖరంబువలె భాసిల్లు ప్రాకారము నంతయు విఱుగఁదన్ని మరల జయము జయంబు రామున కని ముందు చెప్పినట్లు ఘోషించెను. ఆ నాదంబు విని యచ్చటి కావలివారెల్లఁ గలహంబునకు వచ్చిన యీప్రాసాదమునందలి స్తంభమునొకటి యూడఁబెఱికి గిరగిరత్రిప్పి వారినందఱఁ గొట్టిచంపియోరి దుష్ట రాక్షసులారాక ! నన్నేమని తలంచితిరి. శ్రీరా మునిదూతను. సుగ్రీవుమంత్రిని. నాయట్టివారు వేలకొలఁదులు సీతను వెదక భూమి యందంతయు సంచరించు చున్నారు. వారిలో నేనొకఁడను. సుగ్రీవు సేనయందుఁ బదియేనుఁగుల బలముగలవారు నూఱేనుఁగుల బలము గలవారు వెయ్యియేనుఁగుల బలముగల వారు వాయువేగులు దంతములు నఖములు ఱాలు సాధన ములుగాఁ గలవారు కోట్లకొలఁదు లున్నారు. సుగ్రీవుఁడు వారినెల్లఁ గొని యిందువచ్చి మిమ్మెల్ల ధ్వంసము చేయును. మీరు నిష్కారణముగ శ్రీరామునితోఁ బగగొంటిరి. ఇఁక నెక్కడి లంక? ఎక్కడి రావణుఁడు? ఎక్కడి మీరు? సమూలము నాశమైతిరని యఱచెను.

### -: హనుమంతుఁడు జంబుమాలి మొదలైనవారిని వధించుట :-

అంతటఁ బ్రహ్మాస్త్రపుత్రుఁడును దుర్జయుఁడు నగుజంబుమాలి సమస్తాయుధములు ధరించి గొప్ప సేనతోడ హనుమంతుని మీఁదికి యుద్ధమునకు వచ్చి వింటినారి యాకర్ణాంతము లాగి పదిబాణముల హనుమంతు భుజము లందును ముఖమునందును తలయందును నాటునట్లు వైచెను. మొదటనే యెఱ్ఱనైన హనుమముఖము నెత్తురుబొట్లచే నుదయించు సూర్యమండలము వలెనయ్యెను. దానికిఁ గోపించి యాంజనే యుఁడు గుండొక్కటి విసరి వెచిన వాఁడు దానిని బదిబాణములఁ జూర్ణము గావించెను. అంతఁ గపి కోపించి చెట్టొకటి విసరివైచెను. దానిని వాఁడు నాలుగుబాణముల ఖండించు యైదు భుజములందును పది తొమ్మనను నాటిన నాంజనేయుఁడు నగ్నివలె మండిపడి యినుప గుదియు తీసికొని గిరగిరత్రిప్పి గుఱిచూచి వానిపై విసరికొట్టెను. ఆతాఁకున నారాక్షసుఁడు నులినులియై నుగ్గై నూచై తలయేదో మొలయేదో చేయియేదో కాలేదో తెలియరాకుండఁ బడెను. ఆవార్త విని రావణుఁడు మంత్రిపుత్రుల నేద్వురఁబంపెను. వారును మేఘ మువలె నుఱుముచు సైన్యములతో వాయు పుత్రుని మేఘబృందముల వలెఁ జుట్టుకొని బాణవర్షంబు కురి యించిన వానికి గుఱికాక తప్పించుకొని చివాలున నాకసంబున కెగసి వారు తన్ను మీఁద వెదకుచుండ దబాలున గుంపునడుమదూఁకి కొందఱఁ జేతులతోను, గొందఱఁ గాళ్ళతోను, కొందఱ మోఁకాళ్ళతోను, గొం ఱమోఁచేతులతోను బాఁది బాఁది కొందఱకి గోళ్ళతోఁ జీల్చి కొందఱ కోఱలతోఁ గొఱకి కొందఱఁ దోకతోఁ జుట్టి విసరివైచి కొందఱకడ కాళ్ళుపట్టి గిరగిరత్రిప్పి వారితో దక్కినవారిని మొత్తి యీప్రకారము నిమిషములో వారి నందఱఁ గలఁచి యురువులేకుండఁ జేసెను. ఈవార్త రావణుఁడు విని దిగులుపడి భయము వెలికిఁ దెలియనీకుండునట్లు నటించి విరూపాక్ష దుర్ధర యూపాక్ష భాసకర్ణ ప్రఘసులను సేనానాయకుల నేవురను జూచి మీరు పోయి యాక్రోతిఁని బట్టితెండని యాజ్ఞాపించి వాఁడు క్రోతిగాఁడు సుఁడీ నానిమిత్తముగ నింద్రుఁ డొకభూతమును సృష్టిచేసి పంపెను. కావున మీరు వెఱపు మఱపులేక పోరుఁడని హెచ్చరించి పంపెను.

అంతనాయేవురుశస్త్రములు ధరించి హనుమంతుని మీఁదికి వచ్చిరి. అందు దుర్ధరుం డనువాఁడు ముందుపడి పడిగల బాణముల హనుమ శిరంబు రక్తసిక్తంబు చేసిన నమ్మహాకపియునుప్పరంబున కెగసి

యుఱిమి తటాలునఁ బిడుగువలె నతని తేరిపైఁబడెను.ఆ ఘాతమునకోర్వక యెనిమిది గుఱ్ఱములుఁ కాడినొగలు చచ్చి విఱిగిపడియె.దుర్ధరుండును రథమునుండి పడిచచ్చెను.వానిపాటుగాంచి యూపా క్ష విరూపాక్షులు ముద్గరములెత్తి వానరుని ఱొమ్ముపై మోదిరి హనుమయు నందున్న యొక వృక్షంబు పెఱికి త్రిప్పి యొకవిసరు విసరిన నాయిరువురు దానితోడనపోయి క్రిందఁబడి చచ్చిరి.తక్కిన ప్రగసుండు భాసకర్ణుఁ డనువారు పట్టిసశూలమ్ముల హుమ్మని క్రుమ్మిన నమ్మర్కటవరుండు గండుమీఱి కొండశిఖరంబు నొండుగొని విసరివైచిన దానితాఁకున వారిరువురు మరణించిరి.హనుమయు నెప్పటయట్లు తోరణస్తంభముఁ జేరెను.చావఁగా మిగిలినవా రీవార్త రావణునకుఁ దెలిపిరి.

## :- హనుమంతుఁ డక్షకుమారు వధించుట :-

రావణుఁడును తనకుమారుఁడైన యక్షుఁ డనువాని మొగము చూచెను.అతఁడా కనుసన్న యెఱిగి బంగారు వింటినిఁ జేతబూని నేయిపోసిన హెూమాగ్నివలెరేగి యాకసంబున సంచార మొనర్చు తేరిపై నెక్కి బలములతో హనుమంతునిమీఁదికి వచ్చెను.అతఁడు బాలుఁడయ్యును మహాబలవంతుఁడు.వారి యిరువుర యుద్ధము చూచుదేవతలకు గుండెలు పగులు చుండెను.వారియుద్ధవేగమున భూమి వడఁకెను.గాలి కదలక నిలిచెను.కొండలు చలించెను.సముద్రములు క్షోభిల్లెను.అప్పుడక్షకుమారుఁడు పాములఁబోలిన నారాచంబుల మూఁటిని నాకపిరుని మొగమున నాఁటిన గిరణములతోడి సూర్యునిబోలెఁ వెలంగుచు.నాప్ల వంగపుంగవుండు నింగికెగిరి చూపులచేతనే యతని సైన్యమంతయు దహించెను.అక్షుఁడును క్షభితుండు గాక యతనిపైఁ బడబోయిన పుల్లుకప్పిన గుంతవోలిన తన్ను డాయు కుమారునకు జిక్కక టక్కుచేసి యుక్కుమిగిలి హనుమగగనంబున కెగసె.బాలుఁడును నతని వంచించి బాణంబుల నొప్పించె.అప్పుడు హనుమ డేగవలె నాకాశంబునఁ దిరుగుచు నిట్టు లాలోచించె.వీఁడు చూడ బాలుఁడుగాని యుద్ధమునఁ బిడుగు తునక.వీని విలువిద్యయేమి! సాహసమేమి!చమత్కారమేమి! వీని యేటునకు దేవతాకోటులును నోటఱిపోయెదరు.వీని నెట్లుసాధింతును? సులభసాధ్యుఁడు గాడు.మహా ప్రయత్నమున వధింతమనినఁ జూచిచూచి బాలునిజంప మనస్సురాదు.అట్లని యూరకుండిన వీఁడూరకపోవువాఁడును గాడు.తప్పక నాకవమానము ఘటించును.యుద్ధముల శత్రువులపట్ల పెంచి బాలకుఁ జంపనెంచి గగనమును కుద్గమించి తటాలున గుఱ్ఱములపై వాలి యఱచేతఁ గొట్టిచంపి రథము తుత్తుమురు గావించి మరల నెగసె.ఇంతలో నక్షకుమారుఁడు ధారిణికి దాఁటి ఖడ్గముగొని తాను నాకాశమున కెగిరి హనుమంతుఁదాఁకి ఘోరంబుగఁ బోరెను.ఇంతలో హనుమంతుఁడు క్రిందికి వచ్చినట్లు వచ్చి మరలఁ వాని రెండుకాళ్ళు పట్టుకొని గిరగిరఁ ద్రిప్పి పామును గరుత్మంతుఁడు విదిర్చినట్లు విదిర్చి యచ్చటనుండి విసరి నేలపై బాదెను.ఆదెబ్బకు వాని తల పగిలెను.నెత్తు రెముకలు నేలపైఁ జల్లి నట్లయ్యెను.దేవతలు సంతోషించిరి.రాక్షసులు దుఃఖించిరి.హను మంతు డెప్పటియట్ల తోరణ స్తంభముఁ జేరెను.

## :- రావణుఁ డింద్రజిత్తును హనుమంతుని మీఁదికిఁ బంపుట :-

రావణుఁడు వీరుఁడైన యక్షకుమారుఁడు వాయుకుమారునిచే మరణంబు నొందిన వార్త విని కోపముచే నెఱ్ఱనయిన కన్నులతోఁ దన పెద్దకుమారు నింద్రజిత్తుం జూచి యిట్లనియె.పుత్రా! నీవే సర్వాస్త్ర విదుఁడవు.నీకుఁ దెలియని యస్త్రంబులు లేవు.నీవే దేవదానవ సంఘంబులకు వ్యసనప్రదాతవు.విధాతను మెప్పించి మహాస్త్రములు సంపాదించితివి.నీయస్త్రబలంబున నీ వెట్టివారినైన గెలువఁగలవు.ఇఁకనొక ముక్క డి క్రోఁతివార్త చెప్పనేల! రణంబున నీకుఁ దోఁపనియుక్తి నీ వెఱుంగని చమత్కారము లేదు.మాయావిద్య యందు నీసమానులు లేరు.తపమునందు బలమునందును నాతో సమానుఁడవు.ఎప్పటికి నీకు జయము నిశ్చయమని యెఱుంగుదును.అదియునుగాక దేశకాలంబుల నెఱుంగుదువు.కింకరులు జంబుమాలి లోనైన వారును నీతమ్ముఁడక్షకుమారుఁడును గ్రోఁతిచే నిహతలగుట నీ వెఱుఁగుదువుకదా.ఇఁక రణమున కెవ్వరిని బంపి యుపయోగము లేదు.మన యిరువురలో నొకరము పోవలసియున్నది.రాజ ధర్మము ననుసరించి నేను బోరాదు.కావున బాలుఁడవైనను నిన్నె పోయిరమ్మని చెప్పవలసి వచ్చెను.నీవు సకలసేనలతోఁ బొమ్ము. సేన యంతయు వానరుచే సమసిపోకముందే నీయస్త్రబలం మెఱసి వానరు వధింపుము.వానిని బట్టుట యసాధ్యమని తోఁచుచున్నది.సేనలును శస్త్రములును నీభుజబలమును నిన్నుఁ గావలేవు.కావున వానిని నమ్మి యుద్ధముచేయకుము.శస్త్రము ధరించి కాని ముష్టియుద్ధమునకుఁ గాని వానిని సమీపింపకుము.దూర ము నంద యుండి యస్త్రములచే వానిని సంహరింపుము.ఇదంతయు నీవాలోచించి యింతకు మేలైన యాలోచన యుండిననట్లు సేయుము.మనస్సు దృష్టి శరపాతము లొక్కటిగ నుండునట్లు శత్రువున కేమాత్ర

మెడమీయక యుద్ధము సేయుము అని చెప్పిపంపెను.

ఇంద్రజితుండును దండ్రికిఁ బ్రదక్షిణించి సకల సైన్య సమేతుఁడై దృఢమైన విండ్లుగొని హనుమ కెదురుగఁ బోయెను. గొప్పసేనతోవచ్చు నతనింగని వాయుసుతుఁడు మింట గర్జించెను. ఆధ్వనికి దిశలు మాఱుమ్రోగెను. ఇంద్రజిత్తు కొంచెమైన నాలసింపక చిత్తజల్లువలె నతనిపై శితశరంబులుగురియ దొడంగెను. హనుమంతుఁడు దానిని సరకుగొనక మింటి కెగసెను. ఇంద్రజిత్తు విడువక నూర్లువేలుగ బాణములువేసి యతని నొప్పించిన రాక్షసులు మెచ్చి యతని స్తుతించిరి. వాద్యములు మొరసెను. అది విని హనుమ కనలి యతఁడు వేయుబాణములు నందునఁ దిరుగుచు గుఱికి చిక్కక దూరమందున్నట్టుండి దగ్గరగుచు మీద నున్నట్టుండి క్రిందగుచు నిట్టులొకచోటనక తిరుగుచుఁబైపడుచు శత్రువు పైపడునపుడు తొలఁగుచు బాణ వర్షంబునకుఁ జేతు లడ్డమిడుచు నెక్కడఁ జూచినఁ దానయై తిరుగుచుండెను. ఇట్లిద్దఱు పోరునపుడిరువురు తారతమ్యములు వారుగాని మఱెవ్వరుగాని తెలియఁజాలరైరి.

ఇంద్రజిత్తు నంతరము హనుమంతుఁ డెఱుంగలేఁడయ్యె. హనుమంతు డింతవాఁడని రాక్షసుఁ డెఱుంగ లేఁడయ్యె. ఇట్లు సరిసరిగ దెబ్బకుదెబ్బ. ఉద్దికినుద్ది, యేటునకేటు, పోటునకుఁ బోటు గ్రుక్కతిప్పుకొన నైన నెడమీక యిరువురు పోరునెడ నింద్రజిత్తు తనలోఁ దానిట్టు లాలోచించె. ఆహా! యేమి యీకపి ప్రభావము. ఒక్క బాణమైనఁ దనకుఁ దగులనీక యంతరిక్షమంద తిరుగుచున్నాఁడు. ఏమాత్రము సందుదొరకినను చేయిసడలినను బిడుగువలె నానెత్తిపై దూఁకును. వీని విధము చూడ నస్త్రములకును జిక్కఁడు. ఊరక పట్టు పడఁడు. కావున త్వరపడి యితని వధించుటే నీతియని తలపోసి బ్రహ్మాస్త్రము సంధించి యతనిపై విడిచెను.

**:- ఇంద్రజిత్తు హనుమంతుని బ్రహ్మాస్త్రముచే బంధించుట :-**

ఆ బ్రహ్మాస్త్రము హనుమంతునిపైఁ బడి బంధించుటచే నతఁడు క్రిందఁబడెను. ఇట్లు క్రిందబడి యది బ్రహ్మాస్త్రమని యెఱింగి హనుమంతుఁడు బ్రహ్మవరంబు దలఁచి దానివలనఁ దన కపాయము లేకు ఒడునట్లు బ్రహ్మాస్త్రమంతయు జపించుచు నిట్టు లాలోచించెను. బ్రహ్మవరము పాటింపవలయును. మీఱరాదు. ఇ ప్పు డీ రాక్షసులు నన్నుఁ బట్టుకొని రావణునొద్దకుఁ బోదురు కాఁబోలు. అదియు నొకమేలే. రావణుని జూచి మాటలాడుటయుఁ గలుగును, అని యోజించుచుండ రాక్షసులు తటాలున నతనిపైఁ బడి పగ్గములతోను వస్త్రములతోను గాలుసేతులు పట్టికట్టిరి. అంతలో బ్రహ్మాస్త్రబంధ మూడిపోయెను. ఇతర పదార్థములతోఁ గట్టినయెడల బ్రహ్మాస్త్రబంధములూడి పోవునని యామూఢులకుఁ దెలియదు. అస్త్రబంధ మూడిపోవుట యింద్రజిత్తు చూచియయ్యో వీరెట్టిపని చేసిరి? ఇతని కీ కట్లు లక్ష్యమా విడుపించుకొని మరలఁ బైబడిన నేమిగతిఁ ఇతని స్థితిచూడ నస్త్రబంధము లూడినవని తెలిసినవాఁడు కాఁడు. కావునఁ గట్టుపడి యున్నాడుఅని తలఁచెను. హనుమంతుఁ డస్త్రబంధములూడుట యెఱిఁగియు రావణుఁ జూడవలయునని వారి కట్లకుఁ జిక్కి యిక్కట్లు పడుచుండెను. రాక్షసులును హనుమంతుని గట్టి రావణు నొద్దకుఁ గొనిపోయిరి.

రంగన్న-బ్రహ్మాస్త్రమంత్ర మేది?

తండ్రి- నీకుఁ దెలిసిన గాయత్రీ మంత్రమే.

రంగన్న- దానియం దంత ప్రభావమున్నదా?

తండ్రి- గాయత్రీ మంత్రమునకంటె గొప్పమంత్రము లేదు. తన్ను జపించువారిని రక్షించును గనుక దానిక గాయత్రీయని పేరు. దానిప్రత్యక్షరమం దద్భుత మహిమ యున్నది. అది జపింపకయే మంత్రము జపించినను వ్యర్థము. ఇహమును బరమును గలిగించుశక్తి దానియందున్నది. ఒక్కవిషయమువలన దానిశక్తి యెట్టిదైనది తెలిసికొనవచ్చును. శ్రాద్ధాదులందు సద్బ్రాహ్మణులను వేదాచార నిష్ఠులను సదాచారసంపన్నులను నియమింప వలయునని విధి. అట్టి బ్రాహ్మణులు కలికాలమందు దొరకరే యేమి చేయవలయు నని సందేహ ము రాఁగా గాయత్రి జపించు బ్రాహ్మణుఁడు దొరకినఁ జాలునని చెప్పఁబడినది. కాఁబట్టి నిజముగ బ్రాహ్మ ణుఁడైనవాఁడు గాయిత్రిని వదలడు గాయత్రిని వదిలిన వాఁడు బ్రాహ్మణుఁడు కానేరఁడు.

రంగన్న- నేను బ్రతిదినము గాయత్రిని జపించుచున్నాను. నేను బ్రయోగించినఁ బ్రయోజనపడునా?

తండ్రి- నీవెల ? ఈకాలమందు గాయత్రిని సిద్ధిపొందిన బ్రాహ్మణుఁడు మనలో నెవ్వఁడు మన మెఱిఁగినంతవరకు లేఁడు. ఏలనఁగా దాని విధానప్రకార మెవ్వరు దానిని జపించుటలేదు. ఆకారణముచే నది యస్త్రముగ ఫలింపదు. మంత్రార్థ మెఱిఁగి జపించునపుడు దానియందు మనస్సు నిలిపి నూఱుమారైన జపించువాఁడు వేయింటికి నొకఁడైన నున్నాఁడో లేఁడో. అంతేకాదు హిందూ పత్రికయం దొక బ్రాహ్మణనామ

ధారి సంధ్యావందన మందలి తక్కిన మంత్రము లన్నియు నిష్ప్రయోజనములనియు గాయత్రి పదిమార్లు జపించినఁ జాలునని వ్రాసియుండెను. అదియైన వీఁడు జపింపలేదని యే దేవుఁడేడ్చెనో. బ్రహ్మతేజస్సును దక్కించునది గాయత్రియే. ఏమంత్రమైనను చేయినోరు మనస్సు శుద్ధి లేనివానికి ఫలింపదు. హస్తశుద్ధి యనఁ గా దొంగతనము లోనగు నకార్యములు చేయకుండుట మాత్రమే కాదు. దినమును బట్టరాదు. వాక్శుద్ధియనఁగా నసత్య మాడకుండుటే కాదు. పరులమనస్సు నొప్పింపకుండునట్లు మాటలాడుట, భుజింపరానిని భుజింపకుండుట లోనైనవి. మనశ్శుద్ధి యనఁగా నెట్టివారికిని గీడు తలంపకుండుట మొదలైనవి పూర్యము మూఁడు తపముల గుఱించి చెప్పితినిగదా. ఇట్టి బ్రాహ్మణుఁడుండి వాఁడు గాయత్రి నియతిప్రకారము జపించిన నది ఫలించును. అట్టివాఁడు తిట్టినను దీవించినను ఫలమిచ్చును. యమనియమములం దెంతతగ్గనో ఫలమునదంత తగ్గును. ఇప్పుడు బ్రాహ్మణులనేకులు దగ్ధ హస్తులు దగ్ధవాక్కులు, దగ్ధమనస్కులు. కావున మంత్రములు ఫలింపవు. ఋషులయందునుగూడ నొకఋషికిచ్చినంత ఫలము మఱియొకఋషి కీయలేదు.

ఒకనాఁడు విశ్వామిత్రునిఁ జూడ వసిష్ఠుఁడాయన యాశ్రమమునకు బోయెనఁట. గొప్పయతిథి వచ్చెనని సత్కరించి యాయనకుఁ దగిన కానుక యేమియ్యఁగలవని యాలోచించి యొకనాఁ డొకపూట గాయత్రిని జపించిన ఫలమిచ్చెనఁట. వచ్చిన కార్యము ముగిసినపిమ్మట వసిష్ఠుఁడు తనయాశ్రమమునకుఁ బోయెను. తరువాత నొకసారి విశ్వామిత్రుఁడు వసిష్ఠుఁజూడబోయెను. వసిష్ఠుఁ డతిథిని గౌరవించి యాయన యిచ్చినదాని కీడుగ గాయత్రి నొక నాఁడొకపూఁట నొకసారి యొకయక్షరము జపించిన ఫలమిచ్చె నఁట గాయత్రిని చక్కగజపించు వివేకముండిన బ్రాహ్మణు లేల మాలకూళ్ళ పాలగుదురు. దురాచారములచేఁ జెడుదురు. దుష్కామములకు దాసులగుదురు. ఇప్పుడు గాయత్రి యుప దేశించినవానియందు సత్తలేదు. ఉపదేపింపఁబడినవాఁడు జపించుట లేదు ఉత్తపిడికిలి దానముగొని చేయ బోరగిలవేసి నాకిన నెంత కడుపునిండునో యిప్పటి గాయత్రివలన నంతే. ఇంతకు ముందుండిన శృంగేరి శ్రీశంకరాచార్యులవారు మఱికొందఱు మహాత్ములు గాయత్రిని సాధించినారని విని యుంటిని. నీవును బుట్టువుచేతనే కాక యోగ్యతచేతను బ్రాహ్మణత్వమును గాపాడుకొని బాగుపడఁ దలచిన గాయత్రిని మానకుము. దానివలన మేలు కొంతకాలము మీఁద నీకే తెలియును.

తరువాత వినుఁడు. రావణాసురుఁడు హనుమంతు నట్టెచూచి గుండె దిగాలన వీఁడు నేనుఁగైలాశము పెకలించినప్పుడు నన్ను శపించిన నందికేశ్వరుఁడా యేమి? లేక బాణాసురుఁడిట్లువచ్చెనా? యని కోపించి యతనిఁ జుఱచుఱ చూచుచు ప్రహస్తా! యీదుష్టాత్మకు నడుగుము. వీడెవ్వడు? ఏపనికై లంకకు వచ్చెను? వీని నెవ్వఁ డంపెను. ఉద్యానమేల చెఱిచెను? ఏల రాక్షసస్త్రీల భయపఱిచెను? ఏల యుద్ధముచేసెను?

అనిన బ్రహస్తుఁడు హనుమంతుఁజూచి యోరిక్రోతివాడా! భయపడకుము. నిజము చెప్పుము. నిక్కమాడితివా బ్రతికెదవు. అసత్యమాడితివా నీతల నీభుజంబులపై నుండదు వినుము. నీవెవ్వఁడవు? నిన్ను నింద్రుఁడు పంపెనా ? లేక సూర్యునిదూతవా? యమ వరణుల దూతవా లేక రాక్షసుల గెల్వ గోరి విష్ణువు నిన్నుఁ బంపెనా? నీతేజము బలము లాఘవము సామాన్యమగు క్రోఁతి యందుఁగానరాదు. నీవు క్రోఁతివేషము ధరించినట్లు తోఁచు చున్నది. ఏలవచ్చితివి చెప్పరా. నిజము చెప్పిన విడుతుము. లేకున్నఁ జంపుదుమనిన హనుమంతుఁడు వానిని లక్ష్యపెట్టక రావణుఁ జూచి యిట్లనియె.

### -: హనుమంతుఁడు రావణునకుఁ దనరాకకుఁ గారణముచెప్పుట -

రాక్షసేంద్రా! నామాటలు సావధానముగ వినుము. నన్ను నింద్రుడుగాని వరుణుఁడుగాని యముఁడు గాని పంపలేదు. కుబేరునకు నాకు స్నేహ మేనాఁడను లేదు. విష్ణువు పొమ్మనిన నేను వచ్చినవాఁడను గాను. నేను జాతిచేతనే వానరుఁడను. నే నచ్చపుఁ గ్రోతిని. కావున దేవదూతనని వేషము వహించి వచ్చితినని భ్రాంతి వదలిపెట్టుము. నీ దర్శనము నాకు దుర్లభము. అదియగునుపాయ మాలోచించి నీప్రమదావనము పాడుచేసితిని. రాక్షసులు నన్నుఁ జంప రాఁగా నాదేహరక్షణార్థము యుద్ధము చేసినవాఁడఁగాని వారిపై నాకు ద్వేషబుద్ధి లేదు. ఇంద్రాదులుకూడ నన్ను నస్త్రములను గట్టలేరు. నీవే బ్రహ్మచేత వరములను సంపాదించితినని భావింపకుము. నేనును నిట్టివరములను బొందినవాఁడనే. కావున నా కేయస్త్రమువలన భయములేదు. రాక్షసులు త్రాళ్ళతోఁ గట్టినపుడే బ్రహ్మాస్త్రబంధములు వదలి పోయినవి. అయినను నిన్నుఁ జూచి మాటలాడఁ గోరికకల వాఁడనై చిక్కితిని. రాక్షసరాజా? నేనొక రాజకార్యముండది నీకడకు వచ్చితిని. అవధానంబున నేను జెప్పు వాక్యములు వినుము.

దశగ్రీవా! నీపట్టణమునకు నిన్నుఁజూడ సుగ్రీవునాజ్ఞవచ్చితిని. నీసోదరుఁడైన వానరనాథుండు నీకుశ లంబడుగు మనియె. నీతమ్ముఁడగు నతఁడు చెప్పిన యిహపరసౌఖ్యకారణమైన ధర్మవాక్యంబులు వినుము. అ యోధ్యరాజు దశరథుఁడు ఆయన చతురంగబలములు గలవాఁడు. లోకులకుఁ దండ్రివంటివాఁడు. తేజమున మాఱట దేవేంద్రుఁడు. ఆయన పెద్దకొడుకు శ్రీరాముఁడు సత్యసంధుఁడు. జనకునాజ్ఞ చొప్పునఁ దమ్ముడైన లక్ష్మణుతోడను భార్యయైన సీతాదేవితోడను దండకయందు వసింపవచ్చెను. ఆయనభార్య యడవిలోఁ గాన రాకపోయెను. ఆమెను వెదకుచుఁ దమ్ముఁడు సహాయుఁడుగా వచ్చి ఋశ్యమూకపర్వతంబున నున్న సుగ్రీ వునితోఁ జెలిమిచేసెను. సుగ్రీవుడాయన భార్యను వెదకి వార్త దెప్పించునట్లు ప్రతినచేసెను. రాముఁడును బ్రత్యుపకారార్థము వాలిని జంపి సుగ్రీవునకు వానర రాజ్య మిచ్చునట్లు ప్రతిజ్ఞచేసి యట్లే నొక్కబాణంబున రాముఁడు గూలవేసెను. ఇట్లు వానర రాజ్యాధిపత్యంబుగాంచి సుగ్రీవుఁడు నానాదిక్కులయందు సీతనురోయగ వానర నాయ కులను వేనవేలుగఁ బంపెను. గరుడానిలవేగులు మహావీరులు నను కేశవరులు భూమియందం తయు భూమిజను వెదకు చున్నారు. వారిలో నేనొక్కరుఁడను. వాయునౌరసుఁడను పేర హనుమంతుఁడను. సీతా దేవి నిమిత్తమై నూఱామడ సముద్ర మును దాఁటితిని. నీలంకఁజొచ్చితిని. నీయంతఃపురంబున వెదకితిని. నీయి ంటియందే సీతను గంటిని. నేను జెప్పిన దంతయు సత్యము. రాక్షసేంద్రా! బ్రహ్మవంశమునఁ బుట్టితిని. వేదము లన్నియు విధిప్రకారము చదివితిని. శ్లాఘ్యమైన విధముగఁ దపస్సుచేసితిని. ఇట్టి వాఁడవయ్యుఁ బరస్త్రీల బా ధించుట సమూలముగ నాశమొనర్చు నాపదకు మూలమని యెఱుఁగ వైతివి. నీవంటి ప్రాజ్ఞుఁడును నిట్టి యధర్మ కార్యముచేయఁ బాలుపడునా? నీవేమి సుఖమనుభవింపఁ దలంచితివో కాని రామలక్ష్మణుల బాణ ముల యెదుట దేవరాక్షసాదిసంఘములై నను నిలువఁ జాలవని తెలియవు కాఁబోలు. ఇఁకనైనఁ దెలిసి కొనుము. రామునకుఁ గీడుచేసియు క్షేమంబుగ నుండఁగల వాఁడు మూఁడు లోకంబులందును లేఁడు. కావున ధర్మయుక్త మును త్రికాలహితంబును నైన సుగ్రీవు పలుకాదరించి సీతను మరల రామునకుకిమ్ము. అటులీ యవేని కాఁబోవునది నేనేమని చెప్పుదును. సీతాన్వేషణమే కష్టకార్యము . అది నెఱవేఱును. ఇఁక సీతాన్వేషణమే కష్టకార్యము. అది నెఱవేఱును. ఇఁక సీత యిందున్నదని వినినతోడనే తక్కిన కార్యములెల్ల రాముఁడే చక్కఁ బెట్టఁగలడు. రావణా! సీతను నేనును జూచితిని. నీ కన్నుల కాయమ స్త్రీగాఁ గానవచ్చు చున్నదేమో కాని నీ ప్రాణవాయువులు గ్రోల వచ్చిన యాఁడు త్రాఁచు పామనుకొమ్ము. నీవు విషాన్నము దిని బ్రతుకవచ్చునుగాని సీతను గ్రహించి బ్రతుకఁజాలవు. అయ్యా రాక్షసరాజా! మిక్కిలి కష్టించి తపస్సుచేసి ధర్మఫలము సంపాదిం చితివి. ధర్మఫలముగదా ఆయువు శ్రీతేజము వృద్ధిఁబొందించును. అట్టి ధర్మఫలమును పాడుచేసికొనుట బుద్ధిమంతునకుఁ దగునా? దేవతలు రాక్షసులునన్నుఁ జంపలేరను గర్వము మానుము. నీవు వరము వేళ పేరు కొనినవారిలో నరవానరులులేరు. సుగ్రీవుఁడు అమరుఁడు గాఁడు. నీవుపేక్షించి విడిచిన వానరుఁడు సుమా. వానరులచే నీకుఁ జావు సిద్ధము. నేనంతటి తపస్సు చేసితినికదా యిఁక నాకేమి భయమని తలంపకు ము. తపమునకుఁ బుణ్య ఫలమువలెఁ బాపమునకుఁ బాపఫలము కలుగును. గాని తప్పదు. ఒక పుణ్యఫల మనుభవించు కాలమందే తక్కిన పుణ్యఫలము లన్నియుఁ గలుగుచుండును. అప్పుడని యధర్మఫలము నణఁగద్రొక్కును. పుణ్యఫలము పాపఫలము రెండు నొక్కసారిగా ననుభవమునకు రావు. రాత్రిపగ లేకకాలమున వచ్చుటకలదా? కావున నీవు సలిపిన పుణ్యముల ఫలమింతవఱకు ననుభవించితివి. ఇఁక నీవు చేసిన పాప ముల ఫలము శీఘ్రకాలమందే యనుభవించెదవు. నీపాపఫలా నుభవమునకు జనస్థానమున ఖరాదివధ యంకురారోపణమని తలంపుము. వాలియు రామసుగ్రీవుల చెలిమియు స్మరింపుము. వలయునేని యింకను జెప్పెదను. నిన్నుఁ జంక నిఱికించుకొని యేడు సముద్రంబుల ముంచిన వాలిని నొక్కబాణంబునఁ గూల్చినవాఁ డెట్టివాఁడో తలంపుము. అది చాలదేనికార్తవీర్యార్జున సమూలము నిర్జించిన పరశురాముని నీవు విన్నవాఁ డవేకదా. అట్టి పరశురాముని నిమిషంబున జయించిన శ్రీరాముఁ డెట్టి వాఁడై యుండునో నీవే యూహింపుము.

ఉ. నే నొకరుండనే కడిమి నిర్మథనం బొనరింప నేర్తులం
కానగరంబు సర్వమును గాని వచింపఁడు రాముఁ డవ్విధిన్
దానె వధింతు నంచుఁ బ్రతినన్ వచియించెఁ గపీంద్రుసన్నిధిన్
జానకిద్రోహి; నట్లగుట సైరణచేసితి రాక్షసేశ్వరా.

ఉ. నీవశమంద యుండి ధరణీసుత యంచును నీవుచూచు నా
భావిని లంక నంతయును బా డొనరింపఁగఁ జేరియున్న యా

దేవిని గాళరాత్రిఁ గ మదిం దలపోయుము నీ మెడందు
సీతావిధకాల పాశమది దార్కొనెఁ జూడుము యోగ్యపద్ధతిన్.

కం. వినుమీ నావచనంబులు
దనుజేశ్వర ! పలుకువాఁడఁ దథ్యము నే రా
ముని దాసుఁడ దూతుఁడ నం
దును వానరుఁడున్ శుభంబు దొరకొనునీకున్.

తే. అధిప ! బ్రహ్మస్వభువు చతురాస్యుఁడైనఁ
ద్ర్యంబుకుఁడు రుద్రుఁడును బురహరుఁడు నైన
నింద్రుఁడు మహేంద్రుఁడును సురాధీశుఁడైనఁ
గలన శ్రీరామవధ్యునిఁ గావలేదు.

అని హనుమంతుఁడు జంకక దిగులు లేక పలికెను.

రుక్మిణి- హనుమంతుని యుపన్యాస మేమి యద్భుతముగా నున్నదప్పా.

అమ్మణ్ణి- అవేనే విరోధియైనను ప్రభువు గదా మర్యాదదప్పి మాటలాడుట దూతకు నీతి గాదని కార్యహాని యని యెంతోవినయముగాఁ బ్రారంభించి వాఁడు సీతను దొంగిలించుకొని వచ్చుచుండగాఁదాను గన్నులారఁ జూచియు నీవు సీతను దొంగిలించి తెచ్చితి వని చెప్పక సీత నీయింటిలో నున్నది నేను జూచితి నని చెప్పెను. వగచినట్టే యుండవలె వాఁతపెట్టినట్టే యుండవలయునని రావణు ముఖవైఖరి మాఱుకొలఁది దానికిఁ దగినట్టుగాఁ క్రమక్రమముగా నెక్కడకుఁ దేల్చినాఁడో చూడు. ప్రతి విషయమున నెంతయాలోచన!

తండ్రి- మేలే మేలు. గుణమెట్టిదో యెట్లు గ్రహింప వలయునో యామార్గము మీకిప్పుడు దెలియుచు న్నది. సంతోషించితిని. హనుమంతుని గుణములలో నొకగుణమిప్పటికిఁ దెలిసికొంటిరా! తక్కినవారి నట్టులే యాలోచించి తెలిసికొనుడు.

తరువాత వినుఁడు ఈమాటలు రావణుఁడు విని కోపముచే మండిపడి యీ వానరుని జంపుఁడని భటుల కాజ్ఞాపించెను. ఆయాజ్ఞ విని యతని తమ్ముఁడు విభీషణుఁడు లేచి రాజేంద్రా! నా మనవిని వినుము. రాజు దూతను జంపరాదు. ఒకరు చెప్పిన మాటలు తాను జెప్పు దూతయందు నేరమేమియుండును? ఆమాట లెవరు చెప్పి పంపిరో వారిని దండించుట పౌరుషముగాని దూతను జంపి యధర్మకార్యము చేయవచ్చునా? కోపముచేత నితని వధించి ధర్మ హాని గావించితివేని నీవు సకల శాస్త్రాధ్య యనము చేసి సంపాదించిన పాండిత్యమునకు గాసి యొకటేకదా ఫలమగును. ఇంతకు నితనిఁ జంపిన రాఁగల లాభమేమి? నీవు రాముని జంపితివా నీ పౌరుషము కార్యము ఫలించును. నీ వీదూతను జంపితివేని రామునకు వార్త చెప్పువారెవరు? వార్త తెలియకున్న రాముఁడెట్లు యుద్ధమునకు వచ్చును? నీవు యుద్ధప్రియుఁడవుకదా? ఇతఁడు దోషియని నీకుఁదోఁచిన దూతఁకు జేయవలసిన శిక్ష చేయుము తలగొఱిగించుట, యంగవైకల్యము గావించుట, కొఱ డాలచేఁ గొట్టించుట, దేహము మీఁద గుర్తులువేయుట, యిట్టి శాస్త్రీయశిక్షలు చేయవచ్చుననిన సరియని యితని తోఁక కాల్చి లంకయం దంతయుఁ ద్రిప్పుఁడని రావణుఁడు రాక్షసులకాజ్ఞాపించెను. రాక్షసులును లంకలోనుండు వస్త్రములన్ని తెచ్చి హనుమ తోఁకకుఁ జుట్ట నారంభించిరి. వారు చుట్టుకొలఁదిఁ తాను దేహమును దోఁకను పెంచుచుండెను. వారన్ని గుడ్డలు తెచ్చి చుట్టి చమురుపోసి తోఁక కొనయందు నిప్పు తగిలించిరి.

వారిట్లు కట్టుచుండ హనుమంతుఁ డిట్లు లాలోచించుచుండెను. ఆహా! రాముని యాజ్ఞ లేదుగాక. ఉండిన వీరినందఱనిప్పుడే నేలఁబెట్టి కాలరాచనా. కానీ వీరు చేయునదియంతయుఁ జేయనీ ఇప్పటికి సహించు కొనియుండి యీయప్పు వడ్డితోఁదీర్చెదనని వా రేమి బాధించినను నూరకుండెను. రాక్షసులును హనుమంతుని గట్టి తోఁకకొన నిప్పు దగిల్చి పెడఱెక్కలు విఱిచికట్టి "వీఁడే రామునిచారుఁడు రాక్షసులారా! చూడుఁడు" అని యఱచుచు వీధులవెంటఁ ద్రిప్పిరి. హనుమంతుఁ డిదే సమయమని యెక్కడెక్కడ నేమేమియున్నదో చూచుచు వా రీడ్చినట్లెల్లఁ బోవుచుండెను. ఇంతలో రాక్షసస్త్రీలు సీతయొద్దకుఁబోయి జానకీ! యెట్టిని ముఖము క్రోఁతివాఁడు నీతో నేమో గుఱగుట్టని మాటలాడి పోయెనే వానిని రాక్షసులు పట్టుకొని బిఱ్ఱుగఁగట్టి చుట్టి నితోఁకకాల్చి వీధులవెంటఁ ద్రిప్పుచున్నారని చెప్పిరి. ఆమెయు నగ్నిహోత్రునిఁబ్రార్థించెను. తోక కాలుచున్న ను హనుమంతునకుఁ గొంచమైన బాధగాని వేఁడిమిగాని తెలియలేదు. అదిచూచి హనుమంతుఁడాశ్చర్య

పడి యేమిది యగ్నిహోత్రుఁడు చందనశీతలుఁడయినాఁడు. దీనికేదో గొప్పకారణము లేకపోలేదు. తెలిసె దెలిసె. ఇది రామదేవుని కరుణయో సీతాదేవి మహిమయో యుండవలయును. రామకార్యమునకై వచ్చితినని సముద్రుఁడు మైనాకుఁడు తోడ్పడ వచ్చినట్లు లగ్నిహోత్రుఁడు సాహాయ్యమొనర్చుచున్నాఁడు కాఁబోలు. సీత దయచేతను రాముని మహిమచేతను దనమిత్రుని పుత్రుఁడ నగుటను నగ్ని దేవుఁడు నాతోఁక కాల్పకున్నాఁడు అని సీతారాములకు నమస్కరించి యున్నట్టునుండి సింహము గర్జించినట్లు లొక కేకవైచి యా కేసరినందనుఁ డు పర్వతమువలె నుండు తన దేహమును గొంచెపఱిచెను. వెంటనే కట్లన్నియు నూడిపోయెను. మరలఁ గొండవలెనై తోఁతోఁజుట్టుపట్టులనున్న రాక్షసులనెల్ల చావమోదిఁగిరిశృంగము వలె నున్న గవని వాకిటి కెగిరి యచటి యినుప గుదియను దీసికొని వాకిటి కావలి వారలఁజంపి నిలిచి యిట్టు లాలోచించెను.

**-: హనుమంతుఁడు లంకఁ గాల్చుట :-**

ఇఁక నేనుఁ జేయవలసినదేమి? సీతను జూచితిని. రాక్షసుల జంపితిని. రావణుతో మాటలాడితిని. ఇప్పుడీ లంకనుగాల్చి దుర్గముల నశింపఁజేసితినా రామునికార్యము సుకరమగునని యీయింటిమీఁదినుండి యాయింటిమీఁదికి యీమేడనుండి యామేడకు నెగిరి లంకలోని ప్రతిగృహము తగులఁబెట్టెను. ఒక్కొక్క యింటిమీదికిఁబోయి నెమ్మదిగఁ గూర్చుండి నాలుగు ప్రక్కల బాగుగ రగులఁబెట్టి సమీపించిన వారిని గొట్టి మఱియొకచోటికిఁ బోవుచుండెను. గాలియు వాటముగ విసరుచుండె గావున నూరంతయు నల్ప కాలములోనే తగులుకొని మండఁజొచ్చెను. ఈప్రకారము విభీషణుగృహ మొక్కటిదక్కఁదక్కినవన్నియు భస్మీభూత మొనర్చెను. లంకకాలిన విధము రాక్షసులేడ్చిన యేడుపు లేల ? కథ చెప్పెదను. ఇట్లులంక యంతయుఁ గాల్చి కోపము చల్లారఁగా సముద్రమునఁ దోఁకఁ జల్లార్చి తనలోఁ దా నిట్టు నాలోచించెను.

అయ్యో! యెంతపాడుపని చేసితిని. ఒకయిల్లుగాని యొకచెట్టుగాని లేకుండ లంకనంతయుఁ గాల్చి తినే. ఈమంటలోఁ జిక్కి సీతాదేవి కాలిపోయెనేమో. ఇఁక నాగతి యేమి? కోపముచేత బుద్ధినాశముకాఁగా నేను జేయఁబూనిన కార్యమునే సమూలము నాశమొనర్చితిని. ఆహా పాపపుఁగోపము నాకెట్టి పరితాపము తెచ్చి పెట్టెను.

కం. దీపించు నగ్ని జలముల
రూపుచెఱుచునట్లు పెరుఁగురోషమును సుధీ
వ్యాపారముచే నణఁచెడు
నాపురుషుఁడె పోమహాత్ముఁ డవుధన్యుండున్.

కం. కోపి తునుము గురువుల నేం
గోపి కడుం గఱకులాడు గుణవంతులనేన్
గోపి యొనర్పంజాలని
పాపం బేదైనఁగలదె భావింపంగన్.

కం. ఆరయ వాచ్యావాచ్యవి
చారంబేలేదు కొపిజనులకుఁ జేయం
గారాని కార్య మాడం
గారాని యవాచ్య మొండుగలదే చూడన్.

కం. వాతాశనంబు జీర్ణం
బౌతనకుబుసంబు విడుచునట్టుల క్షమచే.
జాత క్రోధముఁ బాచెడి
యాతఁడెపో పురుషుఁడనగ నర్హుఁడె జగతిన్.

అయ్యో! నేనెంత సిగ్గుమాలినవాఁడను. ఎంతబుద్ధిలేని వాఁడను. ఎంతటిపాపిని. కొంచమైన నాలోచింప క సీతను దహించి స్వామిద్రోహము చేసితిని. చక్కనయిన కార్యము నెంతలోఁ బాడుచేసితిని. ఆత్రగానికి బుద్ధిమట్టుగదా. తొందరపడి యిట్టికార్యము చేసి శ్రీరామునిఁ గపులను జూడ నేమని పోదును. పోయి యేమని చెప్పుదును. ఛీఛీ యింకెక్కడి శ్రీరాముఁడు ఎక్కడి వానరులు. ఎక్కడినేను వారికి నాకు ఋణాను బంధము తీఱినది. ఇఁక నాకు మరణమే శరణము. చిచ్చులో దూకుదునా. సముద్రములోఁ జొత్తునా? కొండ మీఁది నుండి తలక్రిందుగఁ బడుదునా? సముద్రములోని మత్స్యములకు దేహ మర్పింతునా? ఎప్పటికైనను

స్వభావము బయలుపడును గాని దాగదు. నా క్రోఁతిబుద్ధి నేడు లోకమునకుఁతెలియనాయెను. అతిచంచలము రజోయుక్తమునైన మనస్సు పాడుగాను సీతాదేవిని రక్షింప శక్తి గలిగియు దండించు పెద్దవారు లేమి స్వతంత్రుడనై కార్యముచేసియిట్టులైతిని. అనుచుండ నాయనకు శభశకునము లయ్యెను. ఇంతలో మరలఁ దెలివితెచ్చుకొని యేమంటిని. ఏమంటిని సీతాదేవిని నేనా రక్షించువాడను. ఎంతటి పొగరుపోతుమాట సీతాదేవి నా యగ్ని దహించును? అగ్ని నేనాఁడైనా నగ్ని దహించునా? ఆమె సమ్మతిలేక దహనుఁడైన నామెను సమీపింపఁ గలఁడా? ఏమి నాబుద్ధి యింత వంకరత్రోవఁ బోయెను. రాము మహత్త్వము చేతను సీతాదేవి దయచేతను నాతోఁకనే యగ్ని కాల్పఁజాలకపోయెనే యిఁక శ్రీరామునిభార్యను సీతాదేవిని లక్ష్మణభరత శత్రుఘ్నులకు దేవతయైన జానకిని నగ్నియా కాల్పఁగలదు?

ఉ. సూనృతవాక్యసంపదను, శుద్ధతపంబునఁ బ్రాణనాయక
ధ్యానరతైక చిత్తముననాయమ కోరిన హవ్యవాహునే
పుని దహించుఁగాక, పూవుఁబోణిని నగ్నిదహింపఁజాలునే.
లేని కుశంకలేల? యని లేమమహత్త్వము నెంచుచుండఁగన్.

ఆకాశమున ఋషులు చారణాదులు తమలోఁ దాము మాటలాడుకొనుచు "ఏమి యీచిత్రము ! లంకయంతయు నొక్కయిల్లుఁతప్పఁ గాలియు సీతాదేవిమాత్రము కాలక మిగిలెను. ఆశ్చర్య మాశ్చర్య" మనుకొనిరి. ఆ మాటలు విని హనుమంతుఁడు బ్రతికితినని సంతసించి యామెను గన్నులార జూచి పోవలె నని యశోకవనమున శింశుపావృక్షము క్రింద నన్ను సీతను గని యామె యడుగుఁదమ్ముల వ్రాలి నమస్కరించి "తల్లీ నాపూర్వపుణ్యమున సుఖముగా నుండు నినుఁ గంటిని. వచ్చినకార్యము లన్నియుఁ దీరె. ఇకఁబోయి వచ్చెద" నని యామెసెలవు తీసికొని మరల సముద్రముఁ దాటుటకై యరిష్టపర్వతం బెక్కి యాకసంబున కెగసెను. అప్పటికిఁ జక్కగ సూర్యోదయమయ్యెను. కమలములు వికసించెను.

ఇట్లాకాశమున కెగసి మరల సముద్రముదాఁటుచుఁద్రోవలో మైనాకుని హస్తమున నంటి గౌరవించి దూరమున మహేంద్ర పర్వతముఁజూచి తనరాక వానరులకెఱిఁగింప సింహనాదము చేసెను. ఆ ధ్వనివిని యిది నిజముగఁ గార్యము సాధించివచ్చు హనుమంతుని కంఠమే యని యంతవఱకుఁ గార్యమేమగునో యని సందేహమునఁ దహతహలాడుచున్న వానరులు సంతోషముచేఁ గొండ లెక్కువారును గుట్టలెక్కువారును జెట్టు లెక్కువారును కొట్టకొనకొమ్మ నిల్చి నిక్కి నిక్కి చూచువారును చేతులు విసరువారును గడలకు గుడ్డ పేలికలు గట్టి యెత్తువారు నైరి. ఆంజనేయుని దూరమందే చూచి క్రోఁతులందఱు చేతులు జోడించి నిలఁబడిరి. హనుమంతుఁడా పర్వతమందలి సెలయేటిలోదూఁకి వెలికి వచ్చెను. అందఱాయనను జుట్టకొని వృత్తాంత మడిగిరి. హనుమంతుఁడును సీతయున్నదిక్కుతిరిగి యామెకు నమస్కరించి, "చూచితిని సీత" నని వారికిఁజెప్పితాను బోయిన విధము చేసిన కార్యము సమస్తము అంగద జాంబవదాదుల కందఱు వినుచుండఁజెప్పెను. అప్పుడు వానరుల సంతోషము నే నేమని చెప్పుదును. సద్దణఁగిన పిమ్మట హనుమంతుఁడు మరల నిట్లనియె.

వానరేంద్రులారా ! చేసివచ్చిన కార్యము చెప్పితిని. దీనిలో శ్రీరామునితోఁ నేదిచెప్పవచ్చునో యేది చెప్పరాదో మీరే యాలోచింపుఁడు. నాయభిప్రాయ మేమన సీతాదేవి శీలమహిమచే శ్రీరామునికార్యము చక్కఁబడెను గాని యితర శక్తిచేతఁగాదు. ఇది వాస్తవము. తొలుత సీతాదేవి యన లోకములోని స్త్రీలలో నొకయుత్తమురాలేమో యనుకొంటిని గాని యామెను దర్శించిన పిమ్మట సర్వకారసర్వావస్థల నామనస్సామె యందే లగ్నమై యామెనే ధ్యానించుచున్నది. రావణాసురుఁడు సామాన్యుడుగాఁడుసుఁడీ. వాని తపశ్శక్తిచే లోకములను నిర్దహింపఁజాలును. అన్ని విధముల గొప్పవాడు. దుర్వ్యాపారమందే దిగి యధర్మకార్యములు చేయకుండెనా యింద్రలోకముఁ బాలింపనర్హుఁడు. అంతటివాఁడు గనుకనే సీతను దాఁకియు నాక్షణమందే చావక బ్రతుకఁగలిగినాఁడు. అట్లని సీతామహిమకంటె రావణమహిమ గొప్పదని భ్రమించెదరేమో. సీత కేవల ప్రేమస్వరూప. ఆమె కోపమెట్టిదో యెఱుఁగదు. కావుననే రావణుఁడామెను దాఁకియు బ్రతికెను. శ్రీరాముని చేత వానిని దండింపఁజేయవలయునని యామె తలంచి యుండుటచే వానిపై నామె కోపింపలేదు. తుదకు రావణుఁజంపునది యామె తేజమే. శ్రీరాముఁడు నిమిత్తమాత్రుఁడే. సీతాదేవి దుఃఖమును ఆమెస్థితిని నేనేమని చెప్పుదును. సీతాదేవి తొలుతనే కృశాంగి. ఇప్పుడు భర్తృవియోగముచేఁ బాధ్యమినాఁడు చదువువాని విద్యవలె మఱింతకృశించి యున్నదని తాను జూచినవిషయము ఆమె చెప్పిన మాటలు నన్ని వారికిఁ జెప్పెను.

జాంబవంతుఁడు లోనగువా రందఱు జరగవలసిన కార్యము నాలోచించి మన మిప్పుడేమి యుఁ జేయరాదు. ఈవార్త రామునకుఁ దెల్పి పిదప నాయన యేమి చేయుఁ డనిన నది చేయుదము. ఇప్పుడే పోదము లెండని యంత్రములతో మీటిన నెగయు పర్వతములవలె చివాలున గగనమున కెగిరి కిష్కింధకుఁ బోవుచుండిరి. ఇట్లు పోవుచు మార్గమధ్యమున సుగ్రీవుని మధువనములోఁ బ్రవేశించి వారివారి యిష్టము వచ్చినట్లు సంచరించి తీఁగెలు త్రెంచి,పండ్లురాల్చి,తేనెలు త్రాగి,కొమ్మలువిఱిచి,యల్లకల్లోలము చేసిరి. దధి ముఖుఁడను నద్యానరక్షకుఁడు రాఁగా వాని నంగదుఁడు పడగొట్టెను. సుగ్రీవునితోఁజెప్పి వీరిని శిక్షింపఁజే యువలయునని యతఁడు పోయి సకలవృత్తాంతము సుగ్రీవునితోఁ జెప్పెను. సుగ్రీవుఁడును అంగదాదులు సీతను జూచివచ్చి యాధైర్యముచే నిట్లు చేయుచున్నారని యూహించి వారినందఱను దతణము నేను రమ్మ ంటినని చెప్పుమని యతని నూరార్చి పంపెను. అతఁడు పోయి యామాటలు చెప్పగా వారందఱు బయలు దేఱి వచ్చి రామలక్ష్మణులకు సుగ్రీవునకు నమస్కరించి నిలిచిరి. ఏమి హనుమంతా! కార్య మేమిచేసితివని రాముఁడడుగ సీతయున్నదిక్కు తిరిగి యామెకు నమస్కరించి "నియతను ప్రాణయుక్తను జూచితిని. సీత" నని చెప్పెను.

అమ్మణ్ణి– సీతను జూచితి నని చెప్పక చూచితిని సీతను అని చెప్పనేల?

తండ్రి– సీతను అని ఆమెపేరు ముందు చెప్పిన రెండవమాట యేమి చప్పునో చూచితినని చెప్పునో కనబడలేదని చెప్పునో బ్రతికియున్నదని చెప్పునో మరణించినదని చెప్పునోయని తననోర రెండవమాట వెడలులోపలనే రాముఁడు తహ తహపాటుచే నేమగునోయని చెప్పవలసినదంతయు జెప్పి కడపట సీతపేరు చెప్పెను. స్త్రీకిఁ బ్రాణమునకంటెను బాతివ్రత్య మెక్కువ. శీలములేని స్త్రీ బ్రతికియుండి పుట్టినయింటికి మెట్టిన యింటికి నపకీర్తి తెచ్చి కన్నవారిని కట్టుకొన్నవారిని నరకమునఁద్రోయుటకంటెఁ జచ్చుట మేలు. కాఁబట్టి ముందు ప్రాణముతో నున్నదనిచెప్పక రావణుచేతిలోఁ జిక్కిచెడినదేమో యిక నటువంటిది నాకేలయని రాముడు నిరుత్సాహియగునోయని ముందు నియతితో నున్నదని చెప్పెను. నియతయని మాత్రము చెప్పినఁ దనమాట వినలేదని రావణుఁ డామెను జంపెనని తలఁచునేమో యని ప్రాణముతో నున్నదని చెప్పెను. ఈవృత్తా ంతమెవరైనఁ జెప్పఁగా విని చెప్పుచున్నాడని తలంచునని చూచితినని చెప్పెను.

తరువాత దాను బోయివచ్చిన వృత్తాంత మిట్లు చెప్పెను. సంపాతి చెప్పఁగా విని నేను నుఱామడ సముద్రమును దాఁటితిని. అక్కడ లంకయను నొక నగరమున్నది. దానికి రాజు రావణుఁడు. వాని యంతః పురమునకుఁ జేరిన యుద్యానవనమున మనస్సంతయు నీయందే నిలిపి నీరాక కెదురు చూచుచు నీవు వచ్చెదవను నాశతో జీవించియుండు సీతను జూచితిని. ఆమెకు రాక్షసస్త్రీలు కావలి యున్నారు. నేలపైఁ బండుకొనుచున్నది. ఆహారము లేక కృశించి యున్నది. వెండ్రుక లొక్కజడగాఁ బెనగొని యున్నవి. నేను జూచునప్పటికి రావణునకు వెఱచి నీయం దాశమాని యురిపోసికొనసిద్ధముగ నుండెను. ఏమేమో మాటలు చెప్పి ధైర్యము కలిగించిప్రాణము పోగొట్టుకొనకుండఁ జేసితిని. వానరరాజుతోమీకు స్నేహము కుదిరినందునకై యామె చాల సంతోషించెను. నీకు నమ్మిక కలుగకాకాసుర వృత్తాంతమును జెప్పెను. ఈచూడామణి నిచ్చెను అని దానినిచ్చి తనకు సీతకు జరిగిన సంభాషణమంతయుఁ దెలిపి ఆమె చెప్పిన మాటలు వినుమని హను మంతుఁ డిట్లనియె.

ఆ. గండ భాగమునను గరఁగిపోఁ దిలకంబు<br>
స్వేదబిందువులను జిత్రరీతి<br>
మణిసిలను నొకంట మమత మీఱఁగ నీవు<br>
తిలక ముంచుజయును దలఁప వలయు.

ఉ. దాఁచితి నీజలోద్భవము దాశరథీ! యిది నీమనోంబుజం<br>
బాఁచికొనంగఁ జాలుట మహాత్మ! భవద్విరహానలంబునన్<br>
గ్రాఁచెడివేళ నిన్గనిక కైవడి దీనిని గాంచిపొంగుదున్<br>
సైఁచుట దోఁపదింక రఘు చంద్రను యియ్యది నీకుఁబంచితిన్.

కం. నెల యొక్కటి యొటులేనియు<br>
నిలుపుదు బ్రాణంబు మేన నీరజ నయనా<br>
నెలకావల బ్రదుకను సోఁ<br>
కులచేతికిఁ జిక్కినిజము కువలయనాథా.

కం. హనుమా!కుశలం బడిగితి
నను మా శ్రీరాము నతని యనుజు సుమిత్రా
తనయు సహామాత్యుని నిన
తనుజాతుని నందునున్న తక్కినవారిన్.

కం. అన్నా!రాఘువుఁ డెట్టులు
నన్ను విపత్సాగరంబునం జెడకుండన్
జెన్నారఁ బ్రోచు నాగతి
మన్ననమెయిఁ బలుకవన్న మఱువకుమన్నా.

కం. బలములతో నిచటికి రఘు
కులతిలకుఁడు వచ్చి కలనఁ గూల్చి దశాస్యున్
గెలుపొంది నన్ను దనపురి
కనువుఁనగొని చనినయేని యశమది గూర్చున్.

అని చెప్పెనని యామెమాటలన్ని చెప్పి రామచంద్రా ! యీవిధముగ దుఃఖించు సీతకు నేవేవో మాటలు చెప్పి ధైర్యము కలిగించి వచ్చితిని అని చెప్పెను.

శ్రీరాముఁడు హనుమంతుఁడు చెప్పిన మాటలెల్ల విని సంతోషించి సుగ్రీవాదులతో నిట్లనియె.ఔరా! ఇతరులు మనస్సుచే నైనను దీర్పరానట్టిదై మిగుల దుర్లభమైన మహాకార్యము హనుమంతుఁ డసహాయుఁడై యొనర్చెను.ఈయనకు సరిసాటి యగువారు లోకమున నెందైనఁ గలరా? ఆమహా సముద్రముదాఁటుటకు నీ హనుమంతుఁడు గరుత్మంతుఁడు వాయుదేవుఁడునుగాక తక్కినవారి కసాధ్యంబు.ఒకవేళ నెవఁడైనను దాటెనేనియు దేవదానవసిద్ధయక్షాదులకైనను జొరరాని లంకను పరాక్రమముచేఁ బ్రవేశించుట కెట్లు శక్తుఁడగును? ఒకవేళఁ బ్రవేశించెఁబో మరల దేహమునఁ బ్రాణములుగలిగి యెట్లు రాఁగలుగును?ఒకవేళ బలపరాక్రమసంపన్నుఁడైనను పోయి మరలిరాఁగలిగినను హనుమంతునంతటి వాఁడు గాక లంకఁజొచ్చి యంతటికార్యమెట్లు నెఱవేర్పఁగలఁడా? సుగ్రీవుఁడు పట్టిన కార్యములు తనశౌర్యబలపరాక్రమములకు యోగ్యమైన విధముగఁ బ్రశస్తగతి హనుమంతుఁడు దీర్చును.భృత్యులనిన నందఱు భృత్యులా? పతి చెప్పిన దెంత దుష్కరమైనను ఘటించి యంతతోఁ దృప్తిపడక దానికి సంబంధించిన దంతయుఁ జక్కఁగ నెఱవేర్చు భృత్యుఁడుత్తమ భృత్యుఁడు.వాఁడే పురుషులందు శ్రేష్ఠుఁడు.భర్తచెప్పి పని మాత్రము చేసి యెక్కువచేయశక్తి గలిగియుఁ జెప్పనిపని మనమేల చేయవలయునని తలఁచు వాఁడు మధ్యమదూత.పతి నియమించిన కార్యమున తన తెలివితక్కువచేఁబాడుచేయు నతఁడు పురుషాధముఁడు.కావునఁ బతి చెప్పిన కార్యము తన శక్తికొలఁది తనకును బతికిని గీర్తి వచ్చునట్లు హనుమంతుఁడొనర్చి సుగ్రీవునకు సంతోషము కలిగించెను. అంతియగాదు నన్ను సీతను లక్ష్మణుని బ్రతికించెను.మమ్ముమాత్రమే కాదు.మా రఘువంశమును బ్రతికించెను అంతయకాదు.మేము మరణించినను వదలని యపకీర్తి బాపెను.ధర్మమును రక్షించెను.

ఇంతటి పరమప్రియమైన వార్తను వచించు హనుమంతుఁడు చేసిన కార్యమునకు సమమైన ప్రకృతి చేయఁజాలమికి మిగుల దుఃఖించుచున్నాను.అయ్యా హనుమంతా! నాకు గల ధనమంతయు నీకిచ్చినఁగాని నాహృదయ తాపముపోదు.అట్లిచ్చుటకు నాయొద్ద ధనమేమియు లేదు.నీకు నా రాజ్యమంతయు నిచ్చినను గొఱఁతయే.కావున మహాత్మా! నీకృతికి ప్రతికృతిగా నా కౌఁగిలి గ్రహింపుము.అని లేచి తన్నె యాయనకు సమర్పించినట్లు హనుమంతుని శ్రీరాముఁడు గాఢముగఁగౌగిలించెను.ఇట్లు కౌఁగిలించి యతని గౌరవించి యిట్లనియె.

ఆంజనేయా! నీవు లంకనంతయుఁ దీఱుపాటుగఁ దిరిగి చూచితివికదా.రావణు బలాబలము లెట్టివి? దుర్గబలము లేపాలివి తెలుపుము.అన్నివిషయములు తెలిసిన నీవు వీనిని మాత్రము శోధింపక విడిచియుండవు.వైరుల బలాబలములు తెలిసినఁగదా ప్రతివిధానము మనము చేయవచ్చు ననిన నాంజనేయుఁడు నవినయముగ నిట్లనియె.రాజేంద్రా ! మదపుటేనుఁగులును గొప్పతేరులును వీరులగు రాక్షసులును పెద్ద గడియ ప్రాకులచే బిగింపఁబడిన తలుపులును గల ద్వారములు నాలుగు గలిగి లంక పదిలమై యున్నది.ఆ ద్వారములపైఁ గనరాకుండ శిలాయంత్రము లున్నవి.శత్రువులు వాని క్రిందికి వచ్చినపుడు యంత్రములను ద్రిప్పిరేని శిలలు కుప్పలు కుప్పలుగ వారిపైఁ బడును.

అంతియుగాక ద్వారప్రదేశములందు మితిలేని శతఘ్నికలుంచఁబడియున్నవి. బంగారురత్నములు వైడూర్యములువీనిచేఁ జెక్కఁబడిన ప్రకారము శత్రువులకు దుస్సాధ్యమై యుండును. ఆపురము చుట్టి మిక్కిలి భయంకరములై మొసళ్ళచే నిండారి యింతంతని లోఁతు తెలియరాని మంచి నీటియగడ్తలున్నవి. ద్వారము లందు విరివిగల పలకలవంతెన లా యగడ్తలపై నాలుగున్నవిఁ పరులసేన లగడ్తదాటి కోటలోనికి రాకుండు టకై వలసినప్పుడీ వంతెనలను యంత్రములచే నెత్తుదురు. అప్పుడవియే ద్వారములకుఁ దలుపులవలె నుండును. పనిలేనప్పుడు మరల విడిచిన వంతెన లగును. ఈ నాలిగిటిలో నొకటి కదలింప రానిదై దృఢమై తిన్నెలును పైడికంబములు గలదియునై యుండును. సేవాదర్శన సమయంబున రావణుఁడిటకు వచ్చుచుం డును. అంతియగాక నాలుగు విధముల దుర్గములను గలిగి యాధారము లేక సముద్రతీరమున నావలు పోవను మార్గములేక యచటివార్త వెలికివచ్చు చొప్పులేక పర్వతాగ్రంబున నాకాశంబు వ్రేలాడునట్లు లంక యెప్పుచున్నది. తూర్పుగవనుకాచి పదివేల రాక్షసులును దక్షిణద్వారరక్షకు లొక్కనియుతమును పడమటివాకిటి నొకప్రయుతమును ఉత్తరమున నొక న్యర్బుదము నుందురు. నూఱువేలమంది రాక్షసులు నడిమిభాగము కాచియుందురు. ఎంత యుండిననేమి? వంతెనలనెల్లఁ జెఱిచితిని. పాతిక బలంబు హతము చేసితిని. ఆగడ్తలు పాడయ్యెను. ప్రాకారమం దెచ్చటఁ జూచినను దెఱపలు తెఱపలు గానవచ్చుచున్నవి. రాక్షసులందఱు నగ్నిహో త్రములు వేదాధ్యయనము కలవారు. అయిన నేమి దయము సత్యము శౌచము రాక్షసు లెఱుఁగరు.

అనిన రాముఁడు ముఖంబునఁ దెలివొంది సకలవానర సైన్యంబులం గూడి యామధ్యాహ్నమందే దండయాత్ర వెడలి సముద్రతీరముఁ జేరెను.

ఇట్లు శ్రీరామచంద్రుఁడు వానరసేనతో సముద్రతీరమున విడిసి సముద్రము నెట్లు దాఁటవచ్చునని యాలోచించు సమయమున నన్నయగు రావణుచే నవమానితుఁడై విభీషణుఁడు నలువురు మంత్రులతో వచ్చి "రామచంద్రా ! శరణాగతుఁడను రక్షింపు" మని వేఁడెను.

అప్పుడు రామచంద్రుఁడు సభఁగూర్చి విరోధియగు రావణుని తమ్ముఁడు శరణుగోరుచున్నాడు. వీనిని మనలోఁ గలుపుకొన వచ్చునా కూడదా? మీ మీ యభిప్రాయములు తెలుపుఁడని వానరులఁ గోరెను. అప్పు డందఱు వానరులు విరోధి తమ్ముఁడుగాన నమ్మరాదనియు నమ్మినఁ గీడుకలుగుననియుఁ జెప్పిరి. హనుమం తుఁడుమాత్రము వారి యాలోచన సమ్మతింపక తన యభిప్రాయ మిట్లు చెప్పెను.

**-: విభీషణుని గ్రహింపవచ్చునని హనుమంతుఁడు చెప్పుట :-**

రాజేంద్రా ! నీవు బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడవు. కార్యము లొనర్చుటయం దతినిపుణుఁడవు. వాక్యకు శలుఁడవు. నిన్నతిక్రమించి చెప్పబృహస్పతియుఁ జాలఁడనిన నితరులమాట యేల? నీవు మాయభిప్రాయ మడుగుట మమ్ము గౌరవింపనే కాని కర్తవ్యము నీకుఁ దెలియకకాదు. అడిగినప్పుడు మాకుఁ జెప్పవలసినది విధి కావున నాకుఁ దోఁచినది నేనును జెప్పెదను.

సీ. వాగ్వాదములనేనను వావదూకుఁడ నంచుఁ
దర్క నైపుణీ చూపఁ దలఁచలేదు
అన్యమతంబుల నణంచి నావాదంబె
గెలిపింపవలయు నన్తలఁపులేదు
ఎల్లవారలకన్న నేన మిన్న యటన్న
గౌరవంబునుగాంచు కాంక్షలేదు
నావచోజృంభణ మావిష్కృతము చేయ
నిది సమయంబంచు నెంచలేదు

తే. దనుజు నందలి పక్షపాతమునఁగాదు
త్వద్గురుత్వాప్తి నభిలాషవలనఁగాదు
రాజవల్లభ దశరథరాజతనయ
కలది వచియింతు శ్రీరామగౌరవమున.

ఇది కార్య మిది యకార్యమని యాలోచించుటయందు నీమంత్రివర్యు లొక్కొక్క రొక్కొక్క యాలోచన చెప్పిరి. వానియందుఁ గొన్ని దోషములు గానవచ్చుచున్నవి. ఒకరీ వచ్చినవానిని కార్యములందు నియోగించి వాఁడు సత్ప్రవర్తనము గలవాఁడని తోఁచిన గ్రహింపవచ్చును. దుష్టప్రవర్తనము గలవాఁడని తోఁచిన విడువ

వచ్చును అని చెప్పిరి. వానిని జేరఁదీసికదా వానికిఁ బనిచెప్పవలయును. పని చెప్పకయే వాఁడు సమర్థుఁడో యసమర్థుఁడో శిష్టుఁడో దుష్టుఁడో యెట్లు తెలియును? చేరఁ దీసితిమా వాఁడిచ్చటికి మర్మము లెఱింగి యేమిచేయునో ? కావున నిట్టి యాలోచన సరిగాదు.

మఱియొకరు సూక్ష్మబుద్ధులగు వేగుల వారిని బంపి వారితనిపోకల నెఱింగివచ్చి మంచి యభిప్రాయ మిచ్చిన గ్రహింపవచ్చుననిరి. ఇది నిరర్థకము. దూరమునసుండు వారి విషయమై వేగుల నియమింపవలయు ను. ఎదుట నుండువారిపై వేటువేల? మనము వేగుల నియమించిన నది యెదుటి వానికిఁ దెలియకుండదినఁ గదా ప్రయోజనము. వానికిఁ దెలియునట్లు వేగులను వానియొద్దకుఁ బంపి ఫలమేమి?

మఱియొకరు సరిగాని సమయమున సరిగాని ప్రదేశమున నితఁడు తగినకారణము లేక సోదరుని విడిచివచ్చెనని చెప్పిరి. ఈవిషయమై యితఁడు సరియైన కారణము కలిగి సరియైన దేశకాలము లెఱిగి వచ్చెనని నా యభిప్రాయము. ఎట్లన, అన్న దుష్టుఁడని చేసిన దకార్యమని యితఁ డెఱుఁగును. అతని కంటె నీవు శౌర్యవంతుఁడవని నీది ధర్మపక్షమనియు నెఱుంగును. కావున నన్న యవమానించి వెడలఁగొట్టినపుడు వచ్చుట కాల విరోధమగునా? యుద్ధము జరుగుచున్నప్పుడు వచ్చిన ద్రోహమగును గాని ముందేవచ్చుట తప్పగునా? కావున మీ రిరువురిలో గుణోత్తరుఁ డెవ్వఁడని యాలోచించి యెక్కువ గుణవంతుఁ జేరెను. బుద్ధి మంతుఁడగు వాఁడిటుచేయక మఱి యెటు చేయును.

మఱియొకరు గూఢపురుషులను బంపి ప్రశ్నోత్తరములచే నతని వాస్తవాభిప్రాయము గ్రహింపవచ్చు నని తెలిపిరి. ఇందొక దోషము తోఁచుచున్నది. ఏమనఁ బరిచితి లేనివాఁడొకఁడు తన్ను గురించి ప్రశ్నలు వేయఁగా నతఁడేనిమిత్తముగఁ దన్నడుగు చున్నాఁడో తెలియని కారణముచే నేమి చెప్పిన నేమోయని బుద్ధి మంతుఁడు తగిన ప్రత్యుత్తరము లీయఁడు. అతఁడు సరియైన యుత్తరము లీయలేదని యతనిపై సంది యము కలుగును. ఈవిధముగ నిర్దోషియగువాఁడును నిష్కారణముగ సందేహింపఁమాటలలోఁ దానేనిపు ణుఁడని తలంచువాఁడు చమత్కారముగ మఱియొకనిఁ బ్రశ్నింపఁగా నతఁడును సమర్థుఁడగునేని యెదుటి వానికి తన భావము బోధపడునట్లు మాటకుమాట ప్రత్యుత్తర మిచ్చుడునుగాని భావమెఱుంగనీయుఁడు కావున నీ యాలోచన సరిగాదు. ఇతఁడు దుష్టుఁడా శిష్టుఁడా యను విషయమై నాయభిప్రాయ మేమనఁ జెప్పెదను. ఇతఁడు మాటలాడునపు డితని ముఖమును బరీక్షించుచుండితిని. దుష్టభావము కొంచెమైనను కానరాలేదు. ముఖము ప్రసన్నముగానే యున్నది. వంచకుఁడగువాఁ డిట్లు నిబ్బరముగ రాఁజాలఁడు. ఒకవేళ వచ్చినను లేనిది కల్పింపునపుడు మాటల యందైనఁ దడఁబడును. అట్టిదోష మితనియందు లేదు.

ముఖము చూచిన భావము తెలియునా యొకవేళ తెలిసినను భావమొక విధముగా ముఖవికారము మఱియొక విధముగా నుండఁగూడదా యను సందేహము గలుగవచ్చును. రూపము నేవిధముగనైన మార్ప వచ్చునుగాని భావమును దాఁచిపెట్ట నెట్టివారికి శక్యముగాదు. భావ మెట్లెట్లు మాఱుచుండునో యట్లట్లు దాని కనురూపముగ ముఖమును మాఱుచు వాస్తవమును బయలు పెట్టుచుండును. కావున ముఖమును బట్టి భావము గ్రహించితిని. ఇతనియందు దుష్టభావము లేదు. ఇతఁడిచ్చటికి వచ్చుటకుద్దేశమొకటి యుండ వలయుఁ గదా యనిన నీవు వాలిని జంపి వానరరాజ్యము సుగ్రీవునికిచ్చినట్లు వార్తయెఱింగినవాఁడు. కావున లంకారాజ్యము నొందఁగోరి నిన్నాశ్రయించెను. కావున నితనిఁ జేర్చుకొనవచ్చును.

అమ్మణ్ణి- విభీషణుఁడు తనకుఁజేసిన యుపకారమును హనుమంతుఁడు చెప్పలేదేల?

రుక్మిణి- ఆమాట చెప్పిన బదు లుపకారముచేయఁ జెప్పుచున్నాఁడుగాని వాస్తవమెఱిఁగి రామునిక్షేమ మాలోచించి కాదని తక్కినవారనరా? తానుసముద్రము దాఁటునపుడు లంకలోను జేసిన కార్యములను రామునకుఁ దాను జెప్పెనా ?

అమ్మణ్ణి- దానికారణము నే నిప్పుడే గ్రహించితిని.

తండ్రి- హనుమంతుని వాక్యములను విని శరణాగత రక్షణమవశ్య కర్తవ్యమని తానుదగిన కారణ ములను జెప్పి శరణాగత రక్షణబిరుదము వహించి శ్రీరాముఁడు విభీషణుఁజేరఁదీసి సేతువుకట్టి సముద్రము దాఁటి లంకముట్టడించి యుద్ధమున కుపక్రమించెను. ఈయుద్ధమునందు హనుమంతుని బలపరాక్రమములు వర్ణించుచుండినఁ జాలఁగాలముపట్టును. కావున ముఖ్యమైనవి చెప్పెదను.

ధూమ్రాక్షుఁడు అకంపనుఁడను రాక్షస నాయకులను వధించెను. రావణుని ముఖ్యమంత్రియగు ప్రహస్తుడు యుద్ధములోఁ జావఁగా రావణుఁడు తానే యుద్ధమునకు బయలుదేఱివచ్చెను. అప్పుడు రావణు

నకు హనుమంతునకుఁ జిత్రమైన యుద్ధము జరిగెను. రావణాసురుఁడు వానరుల నందఱను కసిమసఁగి చంపుచుండఁ జూచి వీని నిట్లూరక విడువరాదని హనుమంతుఁడు చివాలున నతని రథంబు మీఁదికి దుమికి విండ్లు పెఱికి పాఱవైచి తోఁకతో బాణములఁ చెదరగొట్టివైచి యెదురుగ నిలుచుండి క్రూరపుఁ జూపులఁ జూచుచు వానితో నిట్లనియె. రావణా! నేనెవఁడనో యెఱుఁగుదువా? జ్ఞప్తియందున్నానా? ఆనాఁడ నాచేతిదెబ్బ తప్పించుకొంటివి. ఈనాడు నీవెక్కడకుఁ బోయెదవురా. ఇదోయీముష్టి చూచితివా? ఇది ముష్టి గాదు నీపాలిటి యయ దండము. దీనిచే నిన్నిదినములుగ నీదేహమున నీవు రక్షించుచుండిన ప్రాణవాయువు ను వెడలఁగొట్టెదను. వానరులచేత నీచావు సిద్ధమని నమ్ముము. నీకొడుకు అక్షఁడు నాయనా యని యమలో కమునఁ గలవరించుచున్నాడు. ఇదిగో నిన్నిపుడే వానియొద్దకుఁ బంపెద ననుచుండ రావణుఁడు హనుమంతు నొక గ్రుద్దు గ్రుద్దెను. హనుమంతుఁడును కన్నుల నిప్పులురాల హుంకరించి వాని యెదురుఱొమ్మున నొక పోటు పొడిచెను. ఆదెబ్బకు వాఁడు భూకంపమునఁ బర్వతమువలె గడగడ వడఁకి ప్రాణము కంఠగతము కాఁగా వచ్చుపోవు ప్రాణములతో మూర్ఛిల్లిపడెను. రావణుని దుస్థితిని జూచి మేలు హనుమా మేలు అని యాకాశమున దేవతలందఱు ప్రశంసించిరి. అంత కొంతసేపటికి తెప్పఱిల్లి రావణుఁడు లేచి హనుమా !నీవే బలవంతుఁడవు. నీపోటుచే యమలోకము చూచి వచ్చితిని. అనిన హనుమ 'పోటుల తారతమ్య మెఱుగని మూఢుఁడా ! నీవు జీవించి యుండియు నాపోటేల ప్రశంసించెదవు? ఈసారిపోటున కేమయ్యెదవో చూడు' మన నింతలోన రావణుఁ డిరువది చేతులను హనుమంతుని గ్రుద్దెను. ఆదెబ్బకు హనుమంతుఁడు కొంచెము మూర్ఛిల్లెను. ఇతఁడు మూర్ఛతేఱెనా చంపునని భయపడి రావణుఁడు శీఘ్రముగ మఱియొక గుంపుమీఁదికి బోయెను. ఇంతలో హనుమంతుఁడు స్మృతి తెచ్చుకొని 'తప్పెతప్పె ఇతరులతో యుద్ధము చేయునపుడు మనము పోవుట ధర్మము కాదు. కానీ,సమయము దొరకదా. యని చూచుచుండెను. ఇంతలో రావణునితో యుద్ధముచేసి లక్ష్మణుఁడు మూర్ఛిల్లెను. రావణుఁ డాయననుబట్టి యెత్తికొని లంకకుఁ బోవలయునని తలఁ చి దేరు దిగి నేలవ్రాలియుండిన లక్ష్మణుఁజేరఁబోయి పండ్లీలకఱచి యిరువదిచేతులనుబట్టి లక్ష్మణు నెత్తెను. కాని నమ్మహాత్ముని కొంచెమైనఁ గదలింపఁజాలఁడయ్యెను. ఇట్లు లక్ష్మణు నెత్తవలనయునని రావణుడు పోరాడుట చూచి హనుమంతుఁడెగిరి యొక్కదూఁకు దూఁకి లక్ష్మణుపై వంగియున్న రావణు వీపుపై నొక గ్రుద్దుగ్రుద్దెను. ఆదెబ్బకు దిమ్మ తిరిగి రావణుఁడు చచ్చినట్లు నేలఁబడియుండి కొంతసేపటికి లేచి యెట్టెట్లో పోయి రథమునఁ గూలఁబడెనుగాని మునుపటి జవసత్త్వంబులు మరల నతనికి రావయ్యెను. రావణుఁ డెత్త లేని లక్ష్మణునిఁ జయరామచంద్రా యని మనస్సులో ధ్యానించి యెత్తికొనిపోయి హనుమంతుఁడరాముని యొద్ద దించెను. రావణున కంతబరువై లక్ష్మణుఁడు సుహృదుఁడును బరమభక్తుఁడును నగుట హనుమంతు నకుఁ మిగుల దేలికగనయ్యెను.

రావణుఁడును కొంతసేపటికిఁ దెప్పిఱి మరల యుద్ధమునకై కడంగి రాముని మీఁదికిఁబోయెను. గాని హనుమంతుని వాహనముగాఁ గొని శ్రీరాముఁడు నిమిషములో రావణు నోడించి తఱుమఁగొట్టెను. ఇట్లు పరిభవపడి రావణుఁడు తన తమ్ముఁడగు కుంభకర్ణుని నిద్దుర లేపి యుద్ధమునకంపెను. వాఁడును శూలా యుధుఁడై కసిమసఁగి వానరులను బట్టి మ్రింగుచు శూలమున వేలకొలఁది చంపుచుండుట చూచి హను మంతుఁడు పెక్కుబారువుల భారముగల యతని యుక్కుశూలమును బట్టికొని మోఁకాట విఱిచెను. తరువాతఁ గుంభకరర్ణుఁడును శ్రీరామునిచేఁ జచ్చెను. అవల యుద్ధమునకు వచ్చినవారిలో దేవాంతకుడనువాడు హనుమంతుని జంపఁదలంచి పరిఘమెత్తుకొని యాయనమీఁదికి రాఁగా హనుమంతుఁడు తటాలునఁ జేరఁబోయి నడినెత్తిమీఁద పిడికిట నొక మొట్టుమొట్టిన తల రెండుగఁబగిలి వాఁడు చచ్చెను. వానిచావు చూచి త్రిశిరుఁడును యుద్ధమునకు వచ్చెను. బలాధికుండైన యామూఁడు తలల రాక్షసుని జూచి మహాబల నందనుఁడొక కొండశిఖరమెత్తివానిపై వైచెనుగాని వాఁడు దానిని బాణముచేత పిండి పిండిగఁగొట్టెను. ఆ శిఖరము వ్యర్థమైపోవుటచూచి హనుమంతుఁడు ఱువ్వుఱువ్వన రెండుచేతులతో వానిపై చెట్లవాన గురియిం చెను. వాఁడును బాణవర్షముచే దానినెల్ల నణంచెను. దానికిఁ గోపించి హనుమంతుఁడు మెఱుఁగు మెఱిచి నట్లు చివాలున వాని తేరి గుఱ్ఱములపైఁబడి వానిని నఖములచేఁ జీల్చి వైచెను. అట్లు జీల్చు హనుమంతుని నతఁడు శక్తిచే కొట్టెను గాని దానిని ఆంజనేయుఁడు రెండుగ ఖండించెను. త్రిశిరుని ముఖ్యసాధనము తుని యలు కాఁగా నందఱు మేలుమేలని మెచ్చిరి. అంతతోఁబోక వాఁడు ఖడ్గములచే హనుమంతుని బొడువరాఁగా ఆయన దానిని గుంజి యార్చి యాత్రిశిరుని కిరీటముల బట్టికొని వానిని పైకెత్తి నొక విసరు విసరగామూఁడు

మూఁడు తలలు తెగెను.మొండెము నేలఁబడెను.కిరీటముల తోడి తలలను విసరి హనుమంతుఁడు శత్రుసేనలో వైచెను.

తరువాత మాయావియైన యింద్రజిత్తు యుద్ధమునకు వచ్చి బ్రహ్మాస్త్రము నాశ్రయించి యెవరికిని గానరాక మేఘముల చాటుననుండి బాణవర్షము గురియించి వానరసేన నంతయు నేలపాలు చేసెను.కాళ్ళు విఱిగినవారు చేతులు తునిసినవారు తలలు పగిలినవారు ఎముకలు నొగిలినవారు ప్రాణములు పోయినవారునై కుప్పలు కుప్పలుగా వానరులందఱు నేలఁబడిరి.దానికిఁ బ్రతివిధాన మెఱిఁగినవా రగుట హనుమంతుఁడు విభీషణుఁడు మాత్రము కీడు చెందక సుఖముగా నుండి కొఱవులు చేతఁబట్టుకొని జాంబవంతుఁడెచ్చటనున్నాఁడో వెదకనారంభించిరి.ఇట్లు వెదుకఁగా నొకచోటఁ గన్నులునిండ బాణములు గ్రుచ్చుకొని దేహమంతయు గాయములు కాఁగా కుప్పగూలి యుండిన యతనిఁ జూచి విభీషణుఁడు జాంబవంతా! క్షేమమా? యని యడిగెను.ఆయన అయ్యా నీవు విభీషణుఁడవని నీ కంఠ ధ్వనిచే నెఱింగితినిగాని బాణములు గ్రుచ్చుకొనుటచేఁ జూడఁజాలకున్నాను.అయ్యా హనుమంతుఁడు ప్రాణముతో నున్నాఁడా యని యడిగెను.ఆమాట విని యాశ్చర్యపడి విభీషణుం డిట్లనియె.భల్లుకరాజా! రాముని లక్ష్మణుని వానర ప్రభువగు సుగ్రీవుని నెవ్వరి నడుగక హనుమంతుని క్షేమము విచారించెదవేల యనిన నాయన యిట్లనియె.అయ్యా విభీషణా హనుమంతుఁ డొక్కఁడు బ్రతికి యుండెనా యందఱము బ్రతికినవారమే.అతఁడు మరణించెనా యిందఱు బ్రతికి యుండియుఁ జచ్చినవారే కావున నాయన క్షేమము నడిగితిని.

వినిపింపుమనిన నింతలో హనుమంతుఁడు తనపేరు చెప్పి జాంబవంతునకు నమస్కరించెను.హనుమంతుఁ డనుపేరు విన్నఁగానే తన్ను మరలఁ దల్లి కడుపునఁ బుట్టినవానిఁగా నెంచి జాంబవంతుఁ డిట్లనియె.

కపివర్యా ! రా రమ్ము ఈ వానరసేననంతయును గావ నీవే దిక్కు.శౌర్యమున నీకు సమానులు లేరు.మాకందఱకుఁ బ్రాణమిత్రుఁడవు నీవేకదా.నీ శౌర్యసాహస పరాక్రమములు చూపనిదే సమయము.వానరులు భల్లుకములు రామలక్ష్మణులు సంతసించునట్లు నీవొక కార్యము చేయుము.నీవు సముద్రంబు దాఁటి హిమవత్పర్వతమున కేగి యావల ఋషభశైలమును గైలాస పర్వతమును జూచి వానిమధ్యమున మిక్కిలి కాంతులుగలిగిన సర్వౌషధులచే నొప్పు నోషధిగిరిం జూడుము.ఆ పర్వతశిఖరంబున నతిశయించిన కాంతులుగల యోషధులు నాలుగున్నవి.వాని కాంతులచేతనే నీవువానిని గుర్తింపఁగలవు.వానిపేరు సంజీవకరణి,విశల్యకరణి,సావర్ణ్యకరణి సంధానకరణి.అవి కొని తెచ్చితివా యీచచ్చినవానరు లందఱు బ్రతుకుదురు.పొమ్ము వీరికెల్లఁ బ్రాణ మిమ్మనిన హనుమంతుఁడుప్పొంగి దేహమును బెంచి గిరిశిఖరం బెక్కి జయ రామచంద్రా యని నమస్కరించి చివాలున నెగిరెను.ఆత్రొక్కుడు వేగమునకు లంకయంతయు నాట్యమాడినట్టు చలించెను.అట్లు రామచంద్రుని మనస్సున స్మరించుచుఁబోయినపోయి హిమంతముఁజేరి యా మందుల పర్వతముం గనిపెట్టి యా యోషధులకై వెదకెనుగాని యని తమ్మెవ్వఁడో గ్రహింప వచ్చినాఁడని యెఱింగి కనుమఱఁగెను.అది చూచి యాంజనేయుఁడు కోపించి

ఉ    ఏమి నగోత్తమా! కరుణ యింతయులేదుగ రామచంద్రుపై
నేమన యోషధిప్రతతి నిట్టు లణంచితి లోన నిద్ధియే
నీమది నిశ్చితంబు యగునేని మదీయ భుజాభిభూతమై
యేమయి పోదువో యెఱుఁగుదే యిదిగో నినుఁ బిండిగొట్టెదన్

అని సకాంచనమై సహస్రధాతువులతోఁ గూడిన యా పర్వతమునకుఁ దోఁకనుజుట్టి జయ రఘువీరా యని దానిని పాఁతులోఁ బెకలించి మేఘమార్గమున కెగసి దేవతలౌరా యని ప్రస్తుతింప రయమున వానరులందఱు లేచిరి.వానర మధ్యమునఁ బర్వతము డించి పెద్దవారికెల్ల హనుమంతుఁడు మ్రొక్కెను.ఆ యోషధుల వాసనచే రామలక్ష్మణులును తక్కిన వానరులును మూర్ఛదేఱిరి.మరల హనుమంతుఁ డా పర్వతముఁ గొనిపోయి యెప్పటిచోట దించివచ్చెను.

తరువాత సుగ్రీవు నాజ్ఞగొని హనుమంతుఁడు వానర సమూహము తోడఁ బ్రాకారముఁ దాటి లంకఁజొచ్చి గృహము లన్నియు దహించెను.అదిచూచి రావణుఁడు కోపించి కుంభకర్ణుని కొడుకుల కుంభ నికుంభు లనువారలను యుద్ధమునకై పంపెను.వారిరువురు తండ్రివంటి బలపరాక్రమ సంపన్నులు.అందు కుంభుని సుగ్రీవుఁడు చంపెను.నికుంభుని హనుమంతుఁడు వధించెను.రాక్షసవీరులెల్లఁ బోయినవారు పోయినవారే గాని మరల రాకుండుట చూచి రావణుఁడు రెండవసారి యింద్రజిత్తును యుద్ధమునకుఁ బంపెను.ఆమాయలమారి యిట్లాలోచించెను.

ఈవానరులు రామలక్ష్మణులు స్వల్పప్రయత్నములచేఁ జచ్చువారుకారు. నికుంభిలయాగము చేసితినా నాచే నెట్టి వారైనఁ జచ్చునట్టు బ్రహ్మవరము కలదుగదా. దానినొనర్చి రామలక్ష్మణులను సుగ్రీవాది వానరులను నాశనము చేసెదను. నేను యాగము చేయుచోటికి వానరులు రాకుండున ట్లొకయుపాయము చేసెదను. అని తలంచి మాయసీతను గల్పించి దానిని తన తేరిపై నెక్కించుకొని హనుమంతుఁడు దున్నదిక్కు యుద్ధమునకు వచ్చెను. హనుమంతుఁడును వానిని జయింపవలునని యొకపర్వతము నెత్తికొనిపోయి తేరియందు రామా రామాలక్ష్మణాయని యేడ్చుచున్న సీతాస్వరూపము జూచి నిక్కపు సీతయని భ్రమించి యేమి వీఁడీమెనేల రణరంగమునకుఁ దెచ్చెనని సందేహించి పర్వతమును వైవక నిలఁబడెను. అప్పుడాయనఁ జూచి యింద్రజిత్తు అమాయసీత తలవెండ్రుకలు పట్టికొని క్రోధవశుఁడయి కత్తియెత్తి నఱకఁబోయెను. అదిచూచి హనుమంతుఁడు కన్నులనీరు కాఱుచుండ వానితో నిట్లనియె. ఓరిమూర్ఖ! పాపాత్ముఁడా ! శుంఠా ! దయావిహీనుఁడా ! పర సతి తలవెండ్రుకలను నీవేమని పట్టితివి? బ్రహ్మఋషివంశమందుఁ బుట్టియు రాక్షసస్రీతకి బుట్టితివిగావుననే నీవిట్టి మహాపాపము చేయఁగడంగితివి. ఆఁడుదానిని జంపఁబూనిన నీకు దయగాని జుగుప్సగాని లేదుకదా. ఓరి నీచుఁడా! యిల్లు వాకిలి రాజ్యము భోగము సర్వమువదలి పతియందలి భక్తిచే నరణ్యములకు వచ్చిన పతివ్రతను నేమని చంపఁబూనితివి? ఆమె నీకేయపరాధము చేసెను? తండ్రినిమించిన కొడుకును నీవేసరి. ఓరి! ఆమెను విడువుము. విడువక చంపితివా నిన్నెట్లులైనఁ జంపక నేను విడువను నమ్ముము. స్త్రీవధ చేసి పరమపాపుల నరకమున కేల పోయెదవు. అని సీతను విడిపింపవలయునని తనమీఁదికి సేనతోవచ్చు హనుమంతునిఁ జూచి యింద్రజిత్తిట్లనియె. ఓయి హనుమంతా ! నీ బెదరింపులు నాయెద్ద సాగవు. రామలక్ష్మ ణులు సుగ్రీవుఁడు మీరెల్ల నీసతికైకదా యిక్కడికి వచ్చితిరి. కావున ముందీమెను జంపి తరువాత రామలక్ష్మ ణులను సుగ్రీవుని మిమ్మెల్ల నేలపాలు చేసెదను. స్త్రీవధ కారాదంటివి. శత్రువుల మనస్సు నొచ్చుకార్య మెయ్య దియైనఁ జేయవచ్చునను రాజనీతి యెఱుగవా? యని కత్తిజళిపించి యామాయాసీత కంఠమును నఱకి యోరి వానరుఁడా ! మీరందఱు వచ్చినపని ముగిసెనుగదా. ఇఁక రారండని చేత విల్లుగొని బాణవర్షము గరియించిన వానరులెల్ల భయపడి చెదరి పాఱిరి. రోషముచేతను శోకముచేతను హనుమంతుఁ డతనితోఁ గొంత యుద్ధముచేసి తనలో నిట్టులాలోచించెను. ఇప్పుడు నేను వీనిని జంపియు లాభమేమి? ఈవార్త రామునకుఁ దెలిపి యాయన యెట్లుచేయుమనిననటుచేయుట మేలని తలఁచి రామునియొద్దకుఁ బోయెను. ఇ దే సమయమని యింద్రజిత్తు హెూమముచేయ నికుంభిలకుఁ బోయెను.

సీతావధ వృత్తాంతము హనుమంతుఁడు చెప్పఁగా రాముడు విని పట్టరాని దుఃఖమున మూర్ఛపో యెను. లక్ష్మణుఁడును నిర్విణ్ణుడై యన్న కుపచారములు చేయుచుండెను. వానరులెల్ల దుఃఖా వేశముచే మైమ ఱచియుండిరి. ఇంతలో నెచ్చటికో పోయిన విభీషణుఁడు వచ్చి రామలక్ష్మణుల స్థితినుంచి యిది యేమనియ డిగెను. హనుమంతుఁడు చెప్పిన వార్తను లక్ష్మణుడు విభీషణునకుఁ జెప్పెను. ఆమాటను విని విభీషణఁ డా లోచించి యోహెూ తెలిసెఁదెలిసె. ఇది యింద్రజిత్తు మాయ. వ్యసన పడకుఁడని వాని యాలోచన మంతయుఁ దెలిపి యిఁక మన మేమాత్రము జాగుచేసినను వానిహెూమము ముగియును. ఆహెూమము ముగిసెనా మన మందఱము చచ్చినవారమె. కావున రామా యతనిఁ జంపుటకు దగిన సేనతో లక్ష్మణునంపుము. నేను గూడఁబోయెదనని వానరసేనతో లక్ష్మణునితో నింద్రజిత్తుండుచోటికిఁ బోయెను. హనుమంతుఁడును లక్ష్మ ణునకు వాహనమయ్యెను. ఇట్లు నికుంభిలకుఁ బోఁగా రాక్షససేనా మధ్యమున నింద్రజిత్తు హెూమము చేయుచుండెను. ఆసేననెవరికిని భేదింపరాకయుండెను. అప్పుడు లక్ష్మణుని దించి హనుమంతుఁడు రాక్షస సేనపైఁ గవిసి చెట్టొకటి తీసి త్రిప్పి త్రిప్పి రాక్షసులనెల్లఁ గాళ్ళతోను చేతులతోనుఁ దోకతోను కొట్టి కొట్టి నుగ్గుసూచముచేసి తెఱపిచేసికొని లోపలఁదూఱి హెూమ ద్రవ్యములెల్ల నెత్తి నలుదిక్కులఁ బాఱవైచి యగ్నలఁ జెఱచి యింద్రజిత్తుని నొక్కగ్రుద్ద గ్రుద్దఁబోవ నతఁడీ వ్రేటుపడినఁ జచ్చెదనని హెూమము విడిచి తేరిపైకుఱికి విల్లుతీసికొని యుద్ధముచేయఁబ్రారంభించెను. అప్పుడు విభీషణ ప్రేరితుఁడై లక్ష్మణుఁడును వచ్చి వానితో మూఁడుదినములు పోరాడి వధించి యున్నయొద్దకు వచ్చెను.

మూలబలముతోడ నందఱు చావఁగా రావణుఁడు కట్ట కడపటఁదానే యుద్ధమునకు వచ్చి ఘోరయు ద్ధం బొనర్చి యందు మయుఁడిచ్చిన యమోఘ ఘంటాశక్తిచే లక్ష్మణు మూర్ఛిలఁ జేసెను. అప్పుడు మరల హనుమంతుఁడు సంజీవని దెచ్చి లక్ష్మణుబ్రతికించెను. ఈరెండవసారి సంజీవని తెచ్చినపుడు డొక వింత కథను గొందఱు వ్రాసియున్నారు. అది వాల్మీకి రామాయణములో లేదు. చెప్పుమనినఁ జెప్పెదను.

అమ్మణ్ణి– సత్యమో యసత్యమో ముందాకథ చెప్పి తరువాత నదియేల యసత్యమో కారణము చెప్పుము.

తండ్రి– రామాజ్ఞ ప్రకారము లక్ష్మణుని బ్రతికింప హను మంతుఁడు సంజీవని తేఁబోవుచున్నాఁడని విని రావణుఁడు మారీచున కొడుకగు కాలనేమి యింటికిఁబోయి యతనిఁ జూచి యిట్లనియె. మారీచనందనా? రాముఁడు లంకను ముట్టడించు టయు యుద్ధము జరుగుచుండుటయు నీవెఱుంగుదువుకదా? నాశక్తిచే లక్ష్మణుడు మూర్ఛిల్లి పడినాఁడు. అతనిని బ్రతికింప హనుమంతుఁడు సంజీవని దేరద్రోణాద్రికి బోవుచున్నాఁడు. ద్రోణ పర్వత సమీపముననొకమడుగున్నది. ఆమడగుఁలో ధ్యాన మాలిని యను నొక యప్సరస ముని శాపంబున మొసలియై యున్నది. దానిచేతఁ జిక్కి తప్పించుకొన నెట్టివారికి శక్యంబుగాదు. కావున నీవు ముందుగఁబోయి యచ్చోటనొక యాశ్రమంబుఁ గల్పిం చుకొని మునివేషంబు ధరించియుండుము. ఆత్రోవఁ బోవు హను మంతునాకర్షించి ముచ్చటలచేతను మాయలచేతను హనుమంతునికి కాలహరణ మగునట్లు చేయుము. ఉదయమైన యెడ సంజీవని ప్రయోజనపడదు. కావున నుదయమగువఱ కతని నందేయుండఁ జేయుము. కాదేని మడుఁగు లోనికి దిగు నట్లైనఁ జేయుమని చెప్పిన వాఁడును దప్పించుకొను మార్గములేక నా తండ్రిగతి నాకును లభించె ననుకొనుచు మనోవేగంబునఁ బోయి రావణుఁడు చెప్పినచోట నొక రమ్య మైన యాశ్రమమును గల్పించుకొని యుండెను. ఆ మార్గమున నాకాశమునఁబోవుచు హనుమంతుఁడు భూమిపైనున్న యాశ్రమమును జూచి పూర్వము నేను వచ్చినపు డిచ్చట నాశ్రమములేదు. నేఁ డెచ్చటినుండి వచ్చెను. త్రోవతప్పితినా అయినను ఈయాశ్రమమందు ముని పుంగవుఁ డొకఁ డుండును. ఆయనను నడిగి పోదమని భూమికి దిగి మాయామునిని జూచి నమస్కరించెను. అతఁడును నిక్కపు మునివలె నటించి లంకలోని వృత్తాంతముఁ హనుమంతుని రాకకుఁ గారణము చెప్పి యాంజనేయా! నేను యోగదృష్టిచే నీ వృత్తాంతము దెలిసికొంటిని. నీవు పూనిన రాముకార్యము నాకార్యమే యని తలంపుము. నీకు సర్వవిధములు సాహాయ్య మొనర్చెదను. ఈవనమునందే సంజీవనిని మించిన మూలిక లున్నవి. వానిని గొనిపొమ్ము. నీవు ద్రోణాద్రికిఁ బోయి వచ్చువఱకు జాగగను. అంతవఱకు లక్ష్మణుని మేన నూపిరి యుండునో యుండదో. అంతియగాక నాయొద్దఁ జచ్చినవారిని బ్రతికించు మంత్రమున్నది. దానిని నీకుపదేశించెదను. అనిన నయ్యా! నాకా మంత్రతంత్రములేల ? దప్పియగుచున్నది. ఇందునదిగాని కొలనుగాని యుండినఁ జూపుమని హను మంతుఁ డనెను. కాలనేమి యివె నాకమండలువునందు నీళ్ళున్నవిత్రాగుమనిన నవి నాకుఁ జాలవు. సరోవర ంబుండినఁ జూపుమనిహనుమంతుఁడనెను. అట్లైన నిదో యిటు కొంతదూరము పొమ్ము. అందు రమ్యమైన కొలను గలదు. ఆనీళ్ళు త్రాగి రమ్ము నీకు మంత్ర ముపదేశించెద నని కాలనేమి పలుక హనుమంతుఁడతఁడు చెప్పిన మార్గమునఁ బోయి కొలనియందు దప్పిదీర నీళ్లు త్రాగుచుండెను. అప్పు డందున్న మొసతి వచ్చి హనుమంతుని పాదము పట్టుకొనెను. పట్టిన పట్టుతోడన కరువలి పట్టి బిట్టెగసి తన్ని నది పట్టువిడువక దిట్టతనంబున నాయనను మ్రింగఁజొచ్చెను. ఆహా యెటయిక్కట్టులఁ జిక్కుపడితిని. నేను మరణింతునని నాకు వ్యసన మేమాత్రము లేదుగాని రాముని కార్యము నామూలమునఁ జెడునుగదా యని పరితపించెదను. అని యాలోచించుచు మరల ధైర్యము తెచ్చుకొని కానీ మ్రింగనిమ్ము. ఇది యెందుఁ బోఁగలదని హనుమ తటాలున సూక్ష్మ రూపము ధరించి దాని యుదరంబునఁ జొచ్చి మేను పెంచి ప్రేగులు ద్రెంచి నరములు నొంచి యెముకలు పెఱికి కుత్తుకలోఁగూరి పొట్టచీల్చు కొని వెలికివచ్చెను. ఇట్లతఁడు వెలికిరాఁగా నది మకరరూపము మాని దేవతాకాంతయై యెదురునిలిచి హనుమంతునకు నమస్కరించి యిట్లనియె. పుణ్యాత్మా! రామకార్యధు రంధరా! వాయు కుమారా! నీకృపవలన నేను శాపవిముక్త నైతిని. దేవలోకమునకుఁబోయెదను. సెలవిమ్మనిన హనుమంతుఁడు నీ వెవ్వతెవు? నీ పేరేమి? ఏల నీకిట్టి శాపము కలిగె? ఎవరు శపించిరనిన నా సురతరుణి యిట్లనియె. ఆంజనేయా! నేను ధ్యానమాలిని యను దేకాంతను బకనాఁడిచ్చట నేను జలక్రీడ లాడుచుండ శాండిల్యుఁడను మునీంద్రుండు వచ్చినన్నుఁ జూచి మోహించి పిలిచెనుగాని నేను వినయమున నిట్లంటి. ముని వరా ! నేనిప్పుడు రజస్వలనై యున్నదాన. నేఁటికి నాలవనాఁడు స్నానదినంబు. ఆనాఁడు వచ్చెద క్షమింపుము. అ నిన నతఁడంగీ కరించిపోయెను.

అమ్మణ్ణి–ఇంద్రుఁడు మనుష్యస్త్రీలకేగదా తన పాపమును రజోరూపమునఁ బంచి యిచ్చెను దేవతా స్త్రీలకుఁ గూడ నీ బాధగలదా?

తండ్రి– ఈకథ సత్యమునుగుఱించి నేను ముందే సందేహించి చెప్పితినిగదా? తరువాత వినుఁడు.

ధాన్యమాలిని– నేనట్టుపోయి గంధమాదన పర్వతంబున విహరించుచు వీణియగొని పాడుచుండ రావణుం డాత్రోవ బోవుచు నన్నుఁ జూచి బలాత్కరించి చెఱిచెను. అప్పుడు సద్యోగర్భంబున నతికాయుఁడను కుమారుఁడు పుట్టెను. ఆకుమారు నతనికిచ్చి నాలవనాఁడు శాండిల్య ముని యొద్దకుఁబోవ నతఁడు నాచరిత్రం బెఱింగి భ్రష్టురాలా! రాక్షసునితో సంగమ మొనర్చి మరల నాయొద్దకు వచ్చితివా? నీలంజెతనపుఁ జేష్టలు వదలవై తివని కోపించి మొసలివైపొమ్మని శపించెను. నేను నతనిపాదంబులపై వ్రాలి నాయందుఁ దప్పులేదు. రావణుఁడు బలవంతుఁడు నేనేమి చేయఁగలను. క్షమింపు మనిన నీవంతటి శీలవతి వేని స్వేచ్ఛావిహారంబు నేకతం బేలచేసితివని చెప్పి శమించి వేయి సంవత్సరముల గడచిన తరువాత రాముకార్యమునకై హనుమంతుఁ డీమార్గమున వచ్చును. ఆయనచే నీకు శాపమోక్షంబు గలుగునని ప్రసాదించె ఇది నావృత్తాంతంబు. ఉపకారివైన నీకుఁ బ్రత్యుపకారం బొకటి గావించెద. నీవీ వనమందుఁ జూచిన మునివేషధారి రాక్షసుఁడుగాని నిక్కపు మునిగాఁడు. రావణు పనుపున నీకార్యము చెఱుప నిన్ను హింసింప వచ్చినవాఁడు. కావున హెచ్చరిక వహింపుము. ద్రోణపర్వతంబున కిదియే మార్గము అని చెప్పి యది యథేచ్ఛమేగెను.

హనుమంతుఁడును గ్రమ్మఱి మాయమునియొద్దకువచ్చెను. వాఁడాయననుజూచి వీఁడెట్లు బ్రతికి వచ్చెనని దిగులు పడియు వెలుపలికి భయముఁ దెలియనీయక హనుమంతా! స్నానము చేసి శుద్ధుఁడవై వచ్చితివా! ఇక్కడఁ గూర్చుండుము. మంత్రముపదేశించెదను. గురుదక్షిణ నేమియిచ్చెదవనిన నిదిగో గురుదక్షిణ తీసికొమ్మని నడివెత్తి నొకగ్రుద్దు గ్రుద్ది కాల నెగసితన్నెను. ఓహోవీనికి నామర్మము తెలిసినదని వాఁడు తటాలున నారూపము వదలి రాక్షసరూపియై ఖడ్గము కేలఁగొని హనుమంతుని దాఁకెను. హనుమంతుఁడును వానిఁ బట్టుకొని కోఱలుపెఱికికాలను జేతను మర్దించిన వాఁ డారూపమువదలి శరభంబువలె సింహంబువలె వచ్చినవానిని మోదెను. తరువాత సుగ్రీవుని వేషము వేసికొని వచ్చి హనుమంతా ! యింకను నిచట నేమి చేయుచున్నావు? లక్ష్మణుఁడు మూర్ఛదేఱెను. పోదము రా రమ్మనిన నది రాక్షస మాయయని గ్రహించి వానిని బట్టి యెముకలు విఱుగఁగొట్టినవాఁ డెప్పటి వేషంబున యుద్ధంబునకు రాఁగా వాని వధించి ద్రోణాద్రికిఁ బోయి యచ్చట కావలియున్న గంధర్వులతో యుద్ధము చేసి కొండను బెల్లగించి లంకకు వచ్చుచుండెను.

రుక్మిణి– అప్పా! హనుమంతుఁ డశోకవృక్షముపై నుండఁగా రావణుఁడు సీతను జంపఁబొయినపుడు ధ్యానమాలిని యడ్డము వచ్చెనని చెప్పితివే. అది యిచ్చటికి కెట్లువచ్చెను? ఈమడుఁగులో మొసలియై యుండిన లంకలో రాక్షస స్త్రీగా నెట్లుండును?

తండ్రి– ఈ కథ నమ్మరాదనుటకు నిదియు నొక కారణము అతికాయుఁ డనువాఁడు ధ్యానమాలిని యను రాక్షసి కొడుకుగాని దేవతాస్త్రీపుత్రుఁడు గాఁడు. అది లంకలోనే సుఖముగా నున్నది. ఒకఁ డిద్దఱుతల్లుల కడుపులో నెట్లుపుట్టును? ఒకతె యొకచోట స్త్రీగాను మఱియొకచోట మొసలిగాను నేకకాలమున నెట్లుండును? ఇట్టివి మఱికొన్ని విరుద్ధము లున్నవి. అవి పోనీ కథ వినుండు.

ఇట్లు హనుమంతుఁడు ద్రోణాద్రిని తెచ్చుచున్న వార్తవిని రావణుఁడు మాల్యవంతుఁడను రాక్షసుని సేనతో హనుమంతుని మీఁదికి బంపెను. అతఁడును యుద్ధముచేసి హనుమంతునిచేఁ జచ్చెను. తరువాత నాంజనేయుఁడు పర్వతమును వానర మధ్యమున దించెను. సుషేణుఁడు తగిన చికిత్సచేసి లక్ష్మణుబ్రతికించెను. హనుమంతుఁడు మరల నాపర్వతమును పూర్వమున్న చోట నుంచివచ్చి శ్రీరామచంద్ర పాదారవిందంబుల కడ నిలిచెను.

ఈయుద్ధకాలమున హనుమంతుని గుఱించిన యొక యద్భుతకథ గలదు. దానిని జెప్పెదవినుండు ఇదియును వాల్మీకిరామాయణములో లేదు. తన పుత్రుల మంత్రులు బంధువులు లోనుగువారెల్లఁ జావంగా రావణుఁడు మిక్కిలి పరితపించి తనకు మిత్రుఁడై పాతాళలంకకు రాజైన మైరావణుఁ డను వానిఁ దలఁచిన వాఁడు తత్క్షణమే వచ్చి యేల తలఁచితివి యేమికార్యమనిన రావణుఁ డిట్లనియె. మిత్రమా! రాముని వలన నాకుఁ గలిగిన మహాపద నేనేమని చెప్పుదును. స్త్రీలు బాలురు వృద్ధులు నేను దప్ప లంకయంతయు శూన్యమయ్యెను. కావున నీవు నాకు తోడుపడి రామలక్ష్మణుల నెట్లైన నీమాయచే సంహరింపవలయును. పౌరుషంబుతో నిఁకఁ బనిలేదనిన వాఁడును విచారించి మారీచునిగతి నాకును బట్టినదని తలఁచి చేయునది లేక యట్లే కానిమ్మని తన నగరంబునకుఁ బోయి తనకు ముఖ్యులైన సూచీముఖుఁడు ఘలకుఁడును రాక్షసులఁ సర్వ మెఱిఁగించి మీరెట్లైన నాకీకార్యమునఁ దోడురండని వారిని బిలుచుకొని లంకయొద్దకువచ్చి దూరమందు నొక తోపులో నుండి కార్యవిధము నాలోచించుచుండెను.

ఇంతలో మైరావణుఁడు లంకకువచ్చి రావణుతో మాట్లాడి పోయినవార్త వేగులవారిచే విభీషణుఁడు వినికార్యము తప్పెనని భయపడి సుగ్రీవ హనుమజ్జాంబవదాదుల కవ్వార్త యెఱింగించి మైరావణుఁడు మిగుల మాయలవాఁడు. నిదురించు రామలక్ష్మణుల నెట్లైన నపహరించును కావున నెట్లైన వారిని మనము కావవలయు ననిన దీనికిఁ జాలినవాఁడు హనుమంతుఁడొక్కఁడే. ఆసదుపాయ మతఁడే చేయవలయునని యందఱు నొక్కమాటగాఁజెప్పఁగానిమ్మని హనుమంతుఁడు తన తోఁకపెంచి రామలక్ష్మణులకుఁ జుట్టు కోటగోడవలెఁ గ్రిందఁ బాతాళ లోకమువఱకు మీఁద నక్షత్రమండలమువఱకుఁ జుట్టి కొంచెము ద్వారమేర్ప ఱచి యావాకిటఁ దాను కావలి కూర్చుండెను. సుగ్రీవ విభీషణులు ప్రహరి తిరుగుచుండిరి.

మైరావణుఁడు ఘటకుని జూచి మనమే యుపాయము చేయుటకు ముందు రామలక్ష్మణు లెచ్చట నెట్టిస్థితియందున్నవారో యెఱింగిరమ్మని యతనిఁ బంచెను. వాఁరును మాయవానరుఁడై పోయి తోఁకకోటను జూచి గుండెలు జల్లన మరల వచ్చియున్నస్థితి యంతయు దెలిపి రాక్షసేంద్రా! యిది యసాధ్యకార్యము. వీధి నిబోవు పెంట మనకేల పోదమనిన మైరావణుండతని గినిసి సూచీముఖుని జూచి నీవా కోట లోనికిఁబోయి రామలక్ష్మణులఁ గొనితెమ్మనెను. వాఁడును మాయరూపముతోఁ బోయి తోఁకచుట్టు తిరిగి తిరిగి భూమిలోని కెంతదూరము పోయినను ఆకాశమున నెంత యెత్తు పోయినను ఆకోటకు తుదమొదలు నందులేమిఁ జూచి యిట్లు కాదని మెల్లగ సూదివలెనుండు తన నిడుపాటి ముక్కును దోఁకచుట్ట నందునదూర్చి యెత్తిలో పలికిఁ బోవ యత్నించెను. ముక్కుకొంచెము దూర్పఁగానే హనుమంతుఁడు మరల గట్టిగఁ దోఁకనెత్తెను. ఆ సందున ముక్కిఱుకుకొని యక్కడికిఁదెగిపోయెను. వాఁడును శూర్పణఖ గతినాకుఁ బట్టెను. తేరకు ముక్కు పోయెనని ముక్కుచు మూల్గుచు మైరావణు నొద్దకువచ్చి జరిగినదంతయుఁ జెప్పెను. వాఁడు వానిని బదరి రామలక్ష్మణుల నెత్తుకొని వత్తునని తానే బయలుదేఱి విభీషణు వేషము వేసికొని హనుమంతునొద్దకువచ్చి యాంజనేయా !రామలక్ష్మణులు సుఖముగా నిద్రించుచున్నారు కదా యనిననున్నారని హనుమంతుఁడు చెప్పెను. అటులని మనము నమ్మి యుండరాదు. అప్పుడప్పుడు లోపల మన మెవరైనఁ బోయి చూచుచుండ వలయును. నీవు భద్రముగ వాకిటనుండుము. నేను బోయి చూచెదనని మైరావణుఁడు లోపలికి పోయి నిద్రించుచున్న రామలక్ష్మణులపై మత్తుపొడి చల్లితాను మాయగాఁ దెచ్చిన పెట్టెలో వారి నుంచి యితరుల కదికనరాకుండఁ జేసి చంకలోఁ బెట్టుకొని మరలి వచ్చి హనుమంతా ! శ్రీరామలక్ష్మణులు సుఖముగా నున్నారు. హెచ్చరిక యని ప్రహరి తిరుగువానివలెఁబోయెను.

మఱి కొంచెము సేపటికి నిజమైన విభీషణుఁడు వచ్చి హనుమంతా ! శ్రీరామలక్ష్మణులు సుఖులే కదా యనిన నీవు చూచిపోయి యయిదు నిమిషములైనను గాలేదే యింతలో నెట్లు కోటతిరిగి వచ్చితివి? అనిన నతఁడు సర్వము గ్రహించి హనుమంతా ! నీవును మోసపోయితివి గదా. అయిదు నిమిషములకు ముందు నేనిచ్చటికి రాలేదే. మైరావణుఁడు నావేషముతో వచ్చియుండవలయును నీవతనీ లోపలికి విడువలేదు గదా యనిన నీవే యని లోపలికి విడిచితిని. రాజకుమారులు క్షేమముగా నున్నారని చెప్పిపోయెను. అని హనుమంతుఁడు పలికెను. విభీషణుఁడది వినికొంపమునిఁగెనని దిగులుపడి లోపలికి బోయి రామలక్ష్మణులఁ గానక వెలుపలికి వచ్చి యావార్త యందరకుఁ దెలిపెను. అందఱు దుఃఖాంబుధి మునిఁగి నిఁకనేమి గతి యని యాలోచించుచుండ విభీషణుం డిట్లనియె.

ఆలోచనలవలనఁ గాలహరణమే కాని యే ప్రయోజనము లేదు. ఆమైరావణుఁడు పాతాళలంకయం దుండివాఁడు. కాళికాశక్తి పూజచేయువాఁడు. ఆలస్యమైనచో రామలక్ష్మణులను దుర్గకు బలియిచ్చును. కావున ఆంజనేయా? యీకార్యము సాధింప నీ వే యర్హుఁడవు. నావెంట రమ్ము. నీకుఁబాతాళ లంకకు మార్గముఁ జూపెదను. అని లంకకు నుత్తరపు వైపుగ సముద్రతీరమునకుఁ దోడ్కొనిపోయి యం దొకచో నొక మనోహర సరోవరంబుఁ జూచి వాయునందనా! యల్లదే చూడుము. ఈకమలాకరమందు నల్లని తామరతూఁడు గాన వచ్చుచున్నది. నీవు సూక్ష్మరూపము ధరించి దీనిలో దూఱిపోయి పాతాళలంకఁ జొచ్చి మైరావణు వధించి రామలక్ష్మణులఁ దెమ్మని తాను మరలి వచ్చెను.

హనుమంతుఁడు సూక్ష్మరూపము ధరించి యా నాళము వెంటఁ గొంతదూరము పోవ నందొక్కఁడు హుమ్మని గద్దించి మీఁద దూఁకి తాఁకి హనుమంతుని బట్టివిసరి సముద్రతీరమునఁ బడఁ గొట్టెను. హనుమం తుఁడు మరలిపోవ మరల నట్లే యతఁడు చేయ హనుమంతునకు నతనికి ఘోర యుద్ధము జరిగెను. అందు హనుమంతుఁడు చాలనొచ్చి యతనిమీఱలేక వీఁ డెవ్వఁడని యాలోచించి యతనితో నిట్లనియె. అయ్యా నీ

వెవ్వఁడవు?బాలుఁడవయ్యును మహాబలవంతుడవు.అనిన నేను హనుమంతుని పుత్రుడను.నాపేరు మత్యవల్లభుఁడని వాఁడనియెను.నాకుఁదెలియకుండ నాకు కొడు కెక్కడఁ బుట్టెనని తనలో నవ్వుకొనుచు అయ్యా హనుమంతుఁ డస్ఖలిత బ్రహ్మచారిగదా.అతనికి నీవెట్లు కొడుక వనిన మత్స్యవల్లభుఁడిట్లనియె.

సీతాదేవిని వెదుకుటకై హనుమంతుఁడు సముద్రముదాఁటునపుడు అతని చెమటబిందువు సముద్ర ములోఁ బడెను.దానినొక తిమింగలము మ్రింగెను.దానికి నేను జనించితిని.నా తండ్రి హనుమంతుఁడని నాతల్లి నాతోఁ జప్పెను.అనిన నేనే హనుమంతుఁడనని నమ్మఁజెప్పి తానువచ్చిన కార్య మాయనకు దెలిపెను. మత్స్యవల్లభుఁడును హనుమంతుని సత్కరించి యీనాళము వెంటఁబొమ్ము.అందొక ద్వారము గానవచ్చు.ఆ ద్వారమున నినుప త్రాసొక్కటి యున్నది.దానిని శత్రువులు త్రొక్కిన విఱిగిపడును.దానిని నీవు త్రొక్కక వెలు పలనే యుండి వెలికివచ్చి వారిని పోవువారిని కనిపెట్టి సదుపాయము చేసికొని వారితోఁ బొమ్ము.అని చెప్పి పంపెను.హనుమంతుఁడు నట్లేపోయి సూక్ష్మరూపమున ద్వారము నొద్దఁగాయుండెను.అప్పు డచటికి నొక స్త్రీ నీళ్లనిమిత్తమై కుండ యెత్తుకొని వచ్చెను.ఆమె కాళ్ళకు సంకిళ్ళు వేయఁబడి యుండెను.ఆమె కన్నీరుకార్చు చు శ్రీరామలక్ష్మణు లంతవారికి నెట్టి కష్టదశ వచ్చెను.హనుమంతుఁడు సుగ్రీవుఁడు లోనగు వారెల్ల నేమై పోయిరి.పాపపు రాక్షసుఁడు వారిని కాళికి బలి యియ్యఁ దలఁచియున్నాడు.దానికి నీళ్ళు నేను దీసికొని పోవలయునఁట.నేనెంత పాపాత్మురాలను.అని యనుకొనుచు నీళ్ళు ముంచుచుండ నిది యెవతో రామభక్తి గలదిగానున్నదని తలఁచి యామెను సమీపించి నీవెవ్వతెవు? ఏల దుఃఖించుచున్నావని యడిగిన నది యిట్లనియె.అయ్యా! నీ వెవ్వఁడవు?నిజము చెప్పుదువేని నాచరిత్రమును దరువాతఁ జెప్పెదను.మైరావణుఁడు శ్రీరామ లక్ష్మణులను దుర్గకు బలియియ్యఁగోరి యాపాపాత్మురాలి నంపెను.అనిన హనుమంతుఁడిట్లనియె. అమ్మా! నీవు వ్యసనపడకుము.నేను హనుమంతుఁడను.శ్రీరామ లక్ష్మణులఁ దీసికొని పోవ వచ్చితిని, నేను ద్వారము దాఁటి పోఁజాలకున్నాను.నన్ను లోపలికిఁ దీసికొనిపొమ్ము.నీకు మేలు చేసెదను.అని తనరూపముఁ జూపించిన నది నమ్మి యిట్లనియె.

అయ్యా! మైరావణుఁడు నాతోడఁ బుట్టినవాఁడు.కాల దండుఁడను వాఁడు నాభర్త.నీల మేఘుఁడను వాడు నాపుత్రుఁడు ఒకనాఁడాకాశవాణి మైరావణా ! నీతోడఁబుట్టిన దుర్దండి కుమారుఁడు నీపుత్రిని వివా హమాడి యీరాజ్యమునకుఁ బ్రభువు కాఁగలడు.అని చెప్పిన విని నాయన్న కోపించి నన్ను నాభర్తను నాపుత్రుని కారాగృహంబున నుంచి నన్నుఁగన్న కష్టములు పెట్టుచున్నాఁడు.నీవు సూక్ష్మరూపము వహించి యీకుండనీటిలో నుండుము.నేను గొనిపోయెదనని చెప్పెను.హనుమంతుఁడును కప్పవలెనై యానీటిలో నుండెను.దుర్దండి యానీటికుండ నెత్తుకొని త్రాసును దాటఁగానే యది విఱిగి పడెను.కావలియున్న రాక్షసు లంద ఱామెను తర్జించి భర్జించి యెవరిని శత్రువును గొనివచ్చితిని చూపుమనిరి.ఆమె మీరే చూడుఁడనియాకుం డ గ్రిందవైచెను.దానిలోనుండి హనుమంతుఁడు కొండంతరూపముతో వచ్చి యారాక్షసుల నందఱఁ జంపి దుర్దండి వెంటఁగాళికా దేవాలయమునకుఁబోయి యందు రామలక్ష్మణులు నిద్రించుచున్న పెట్టెను గ్రహించి యూరి వెలుపల పదిలపఱిచి యూరక పోరాదని మరలవచ్చి యూరంతయుఁ బాడుచేసి రాక్షసులనెల్లఁ జంపఁ బ్రారంభించెను.ఆవార్తవని మైరావణుఁడనేక సేనలతోడ యుద్ధమునకు వచ్చెను.ఆసేన నంతయు హనుమంతుఁడు నేలపాలు గావించి మైరావణునిపై గవిసి ఘోరయుద్ధంబుచేసి యతని వధించి మరలిపోవ నతండు వచ్చి యాంజనేయా యెందుఁబోయెదవని కత్తితోఁబొడిచెను.ఓహెూ నేను పూర్ణముగఁ జంపక విడిచితినిఁ గాబోలు నని తలఁచి మరలఁ బోరాడి వానిని క్రిందబడవైచి గొంతుపైఁ గాలుంచి త్రొక్కి నలిపి పీనుఁగునుఁజేసి పాఱవైచి మరలిపోవ నతఁడు మరలవచ్చి హనుమంతా ! యని యఱచి ఱొమ్ముపై నొక గ్రుద్దు గ్రుద్దెను.హనుమంతుఁడును వీని నిట్లు విడువరాదని పైపడి రెండుకాళ్ళు రెండుచేతులఁ బట్టి రెండుగఁ జీల్చి పాఱవైచెను.ఎప్పటియట్ల వాఁడు బ్రతికి మరల యుద్ధమునకు వచ్చెను.ఎన్నిమార్లు చంపినను మఱిమఱి వాఁడు బ్రతుకుచుండ నేమిచేయుటకుఁ దెలియక దిగ్భ్రమ నొందియుండిన హనుమంతునిజూచి దుర్దండి యిట్లనియె.అయ్యా! వీఁడిట్లు చచ్చువాఁడు కాఁడు.ఈపురంబు నందీవంక నొక కొంతదూరము పోయిన నొక మహాబిలమున్నది.దానిలో నొక గుహ యున్నది.ఆగుహలో నొక గుండున్నది.ఆగుండున కేడు రంధ్రములున్నవి.వానియందుఁ దుమ్మెదలై వీనిప్రాణములు సంచరించుచుండును.వాని నన్నింటిని కలయంబట్టి యొకసారిగఁ జంపితివేని వీఁడు చచ్చును.అనిన విని హనుమంతుఁడు తోఁకను వాని కుత్తు కకుఁజుట్టి వానినీడ్చుకొని యాగుండునొద్దకుఁ బోయి యాతుమ్మెదలనెల్ల నొక్కసారిగ నలిపిచంపెను.అంతలో

మైరావణుఁడును జచ్చెను. అంత హనుమంతుఁడు సంతోషించి దుర్దండి కుమారునకుఁ బట్టముఁ గట్టి మత్స్య వల్లభుని యువరాజుగఁ జేసి రామలక్ష్మణులున్న పెట్టెనెత్తికొని మరల లంకకు వచ్చెను. సూర్యకిరణము లు తగులఁగనే మచ్చువిఱిగిపోయి నిద్రపోయి లేచినవారివలె రామలక్ష్మణులు లేచిరి.

రుక్మిణి– అప్పా ! మైరావణుఁడనఁగా నేమియర్థము?

తండ్రి– ఇది సంస్కృతమున నాంజనేయ స్తోత్రమందు మహారావణ యని ప్రయోగింపఁబడి యున్నది. కొందఱు మహీరావణుఁ డందురు. ఆశబ్దము తద్భవముగా మైరావణశబ్దము గ్రహింపవచ్చునని నేను నట్లే చెప్పితిని. ఈశబ్దము విపరీతముగ నిప్పుడు మాఱుచున్నది. ఒకనాడు చెన్నపురిలో బండిలోఁ బోవు చుండఁగా బ్రక్కగోడకు నొక ప్రకటన పత్రికలో మైల్ రావణు నాటకమని యఱవమున వ్రాయఁబడియుండెను. నాకు నవ్వు వచ్చి ప్రక్కనున్న యఱవ వాని నొకని మైల్‌రావణు డనఁగా నేమని యడిగితిని. మైల్ అనగా నఱవమున ందు నెమలి యది వాహనమో ధ్వజమో కలవాఁడు మైల్ రావణుఁ డనెను. ఇంతలో మఱియొక పెద్దమనుష్యుడు వాఁడు 'మైల్' ఎత్తు కలవాఁడుగను మైల్ రావణుఁడయ్యెననెను.

తరువాత రావణాసురుఁడే యుద్ధమునకువచ్చి శ్రీరామునిచే హతుఁడయ్యెను. శ్రీరాముఁడు విభీషణు నకు లంకారాజ్యమిచ్చి తాను గెలిచినవార్త సీతాదేవికి హనుమంతునిచేఁ జెప్పి పంపెను. ఈవిషయము సీతా చరిత్రమునందు మీకుఁ జెప్పి యున్నానుగదా. ఆవల శ్రీసీతారామలక్ష్మణులు సకల వానరులతోడను విభీషణాదుల తోడను పుష్పకవిమానమెక్కి యాయోధ్యకైపోయి ముందు భరద్వాజాశ్రమంబున దిగిరి. ఆనాటికి సరిగపదునాలుగు సంవత్సరములు ముగిసెను. అచ్చటినుండి భరతునికిఁ దన రాక చెప్పుమని శ్రీరాముడు హనుమంతుని బంపెను. ఆయనయును అన్ని యడవికిఁబోయి పదునాలుగు సంవత్సరములు ముగిసినను నింకను రాలేదని దుఃఖముతో నగ్నియందుఁ బ్రవేశింప యత్నము చేయుచుండిన భరతుని జూచి యాయనకు శ్రీరాముల రాకచెప్పి యగ్నియందు దుముకకుండ నాఁపెను. తరువాత సీతారాములకుఁ బట్టాభిషేకము జరిగెను.

రుక్మిణి– ఇంత యుపకారముచేసిన హనుమంతునకు సీతారాము లేమి బహుమతి నిచ్చిరి. మునుపు తమకే లేదు గాన నియ్యకపోవుట న్యాయమే. ఇపుడు రాజ్యమంతయుఁదమదే కదా. ఏమిచ్చిరి.

తండ్రి– పట్టాభిషేక సమయంబున ననేకము లమూల్యములైన వస్త్రాభరణములను సీతాదేవి భర్త ముఖముఁ జూచుచు హనుమంతున కిచ్చియంతతో సంతుష్టిలేక తనకు శ్రీరాముఁడిచ్చినట్టిదయి శ్రేష్ఠములైన రత్నములతోను చంద్రమండల కాంతిగల ముత్యములతోను మనోహరమై మిఱుమిట్లు గొలుపు తేజము గల యాణిముత్తెముల హారంబుఁదాను ధరించి యుండినదానిని తన మెడలో నుండి తీసి చేతఁబట్టుకొని లేచి నిలఁబడి వానరుల ముఖమును జూచుచుండెను. ఆమె యభిప్రాయమెఱిఁగి శ్రీరాముఁడిట్లనియె. దేవీ! యెవ్వఁడు గుణసమూహముచే నీకు మెప్పుగలిగించెనో యెవఁడు బుద్ధిబలపరాక్రమంబుల నెప్పుడు దీపించు చుండునో యట్టి వానికి దాని నిమ్మనిన నామె హనుమంతుని బిలిచి యతనిఁ దన ప్రేమరసముచేఁ గట్టి నట్టు లాసరము నాయన మెడలో వైచెను.

రుక్మిణి– సీతాదేవి యిచ్చినదంతయు నొక్క ముత్యాలసరమా? శ్రీరాముఁడే మిచ్చెను? ఆంజనేయుఁ డేమి యడుగలేదా?

తండ్రి– ఆంజనేయుఁడేమి యడిగెనని యడిగెదవే. హనుమంతుఁడు మనవలె బిచ్చగాడని తలఁచి తివా లేక కూలి వాఁడని తలఁచితివా? దేవుఁడా నీకు రెండు టెంకాయలు కొట్టెదను. నాకీపని చక్కఁజేయుము. స్వామీ! నాకు బిడ్డల నిమ్ము, పాపల నిమ్ము, సొమ్ములిమ్ము, చీరలిమ్ము అని కూలి వాంద్రవలెఁ దిరిపెగాంద్రవలె భగవంతుని సేవించువా రుత్తమమైన భక్తిగలవారు గారు. దేవునిఁ బూజింపవలసినది సేవ చేయవలసినది మనకు విధి కావునఁ జేయుదము. మన మేలునకుఁ గావలసిన సర్వజ్ఞుఁడైన భగవంతునకుఁదెలియదా. ఆయన దయవచ్చి యిచ్చిన నీయనీ. ఈయకుండినఁ బోనీ. ఇచ్చుట ఈయకుండుట మనమేలునకేకాని కీడునకుఁగాదు. అని నిశ్చయబుద్ధి నిశ్చల భక్తి కలిగి దేవుని సేవింపవలయును. హనుమంతుడా విధముగ సేవించినవాఁడు దేవుఁడే మనల నేమి కావలయునని యడిగెనా యప్పుడు చెప్పుకొనవచ్చును. సీత ప్రేమస్వరూపయని ముందే చెప్పితిని గదా? అట్టి దేవి తన పూర్ణప్రేమచేఁగట్టినట్టు లాయనను హారముచే స్వయముగ నలంకరించి నంతకంటె నింకనేమి కావలయును.

రుక్మిణి– శ్రీరాముఁడేమియు నీయలేదా?

